# అభినవ గద్య ప్రబంధము

రచన :

మహాకవి దాసు శ్రీరాములు



ప్రచురణ :

మహాకవి దాసు శ్రీరాములు స్మారక సమితి

హైదరాబాదు-20.

# మహాకవి దాసు శ్రీరామా మాత్య రచిత గ్రంథములు



1. ఆచారనిరుక్తి 2. దురాచారపిశాచభంజని 3. పతిత సంసర్గ ప్రాయశ్చిత్తోపన్యాసము 4. విగ్రహారాధన తారావళి 5. వైశ్యధర్మదీపిక 6. నౌకాయానము 7. పాశ్చాత్యవిద్యాప్రశంస 8. త్రిమతములు 9. పునర్వివాహ విచారణ 10. నమస్కారవిధి 11. శ్రాద్ధ సంశయవిచ్ఛేదిని 12. తెలుఁగునాడు 13. అభినయ దర్పణము 14. కృతులు 15. జావళీలు-స్వరజతులు 16. పదములు 17. జానకీ పరిణయ నాటకము 18. మనోలక్ష్మీవిలాస నాటకము 19. అచ్చ తెలుఁగు అభిజ్ఞాన శాకుంతల నాటకము 20. రత్నావళీ నాటకము 21. మాళవికాగ్నిమిత్ర నాటకము 22. ముద్రారాక్షసనాటకము 23. మాలతీమాధవీయనాటకము 24. ఉత్తరరామాయణచరిత్ర నాటకము 25. మహావీర చరిత్ర నాటకము 26. కురంగగౌరీశంకర నాటిక 27. మంజరీమధుకరీయము 28. సంగీతరసతరంగిణియను బుద్ధ నాటకము 29. తర్కకౌముది యనున్యాయబోధగ్రంథము 30. అభినవ గద్య ప్రబంధము 31. సాత్రాజితీవిలాసము - యక్షగానము 32. లక్షణా విలాసము - యక్షగానము 33. ఆంధ్ర దేవీ భాగవతము మొదలగునవి.



# అభినవగద్యప్రబంధము

రచన :

మహాకవి దాసు శ్రీరాములు

ప్రచురణ :

మహాకవి దాసు శ్రీరాములు స్మారక సమితి

హైదరాబాదు-20.

# అభినవగద్యప్రబంధము

## మహాకవి దాసు శ్రీరాములు

8వ కూర్పు

మూల్యము : రు[illegible]- లు. 6

ప్రతులకు :
శ్రీ మహాకవి దాసు శ్రీరాములు స్మారక సమితి
1-10-97. అశోక్‌నగర్, హైదరాబాదు-20.

ముద్రణ : శ్రీ లక్ష్మీ ప్రెస్, విజయవాడ-2.



మహాకవి దాసు శ్రీరాములు

*1846 — 1908.*

# ఉపోద్ఘాతము

"అభినవగద్యప్రబంధము" అను నీ వచనకృతిని రచించినవారు దాసు శ్రీరాములుగారు. నవ్యాంధ్రసాహిత్యజగత్తులో కడచినశతాబ్దమున ప్రసిద్ధివహించిన కొక్కొండ వెంకటరత్నము, గోపీనాథ వెంకటకవి, మండపాక పార్వతీశ్వరశాస్త్రి, వసురాయకవి, వావిలికొలను సుబ్బారావు మున్నగు మహావిద్వత్కవుల కోవలోనివారు.

వీరు సమకాలికముగ వెలసిన సాహిత్యప్రక్రియలన్నిటియందును సిద్ధహస్తులు. తెలుఁగునాడు మొదలైన కావ్యములు చక్కట్లదండ, సూర్య శతకము మున్నగు శతకములు – శాకుంతల, మహావీరచరిత్ర మున్నగు నాటకానువాదములు వీని యన్నింటికి మకుటాయమానమైన "దేవీభాగవతము" వీరి సర్వతోముఖ కవితాప్రజ్ఞయు, పాండితీవిశిష్టతయు వేనోళ్ళ చాటును.

కవితారచనయందేగాక ధర్మశాస్త్రము, జ్యోతిశ్శాస్త్రము మున్నగు వానియందు వీరి వైదుష్య మసమానము.

"ఏ గతి రచియించిరేని సమకాలమువారలు మెచ్చరేకదా" అనివాడుక. కాని శ్రీరాములుగా రిందు కపవాదము. జగద్విఖ్యాత శతావధానులైన తిరుపతి వేంకటేశ్వరకవులలో నొకరైన శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు వీరిని గూర్చి యెట్లు వ్రాసిరో చూడుడు.

"ఈ శ్రీరామకవిచంద్రుని నేను రెండవ శ్రీనాథునిగా నా మనస్సులో అనుకొందును."

"........ఈయన సరసకవి, విద్వత్కవి, స్వతంత్రకవి, ఆశుకవి, దాత, నేత. ఇన్నియోగాలు పట్టినవారు యేకాలంలోను కవులలో మృగ్యులే"[1]

అట్టి శ్రీరాములుగారి కృతి యిది. దీని ప్రశస్తి వివరణము,

## వచన పఠనీయ గ్రంథములు

### మ ద రా సు వి శ్వ వి ద్యా ల య ము

శ్రీరాములుగారీ వచనప్రబంధమును, విశ్వవిద్యాలయమున పఠనీయ గ్రంథముగా ప్రయుక్తమగుటకు వీలగునట్లు రచించితిమని వారి ఆంగ్లపీఠికలో ముందు వివరించినారు. ఈ పీఠిక తెలుగులోకూడ కలదు.

### గ ద్య ప్ర బం ధ ము

తెలుగున నీ వచనప్రబంధమునకు గద్యప్రబంధమని పేరొకాను టయేగాక ఇది విశ్వవిద్యాలయపరీక్షలకు తగినట్లు రచింపబడినదని గ్రంథకర్తలే స్వయముగా నుట్టంకించినారు. అయితే ఇది పదిసంవత్సరములైనవెనుక క్రీ. శ. 1893 లో ముద్రితమైనను ఇది పఠనీయ గ్రంథముగా పెట్టినట్లు లేదు. దీనికి నా వెనుక మఱియొక ముద్రణముకూడ వెలువడినది. కాని అప్పుడును నిది పఠనీయగ్రంథ మైనట్లు లేదు.

నే డీ గ్రంథము, విపులపీఠికాది విశేషములతో ముద్రితమైనకతన దీనిని విశ్వవిద్యాలయ పరీక్షలకు పఠనీయగ్రంథముగా విశ్వవిద్యాలయాధికారులు నిర్ణయించి దీనికి సమధికప్రచారము గల్గింతురుగాక.

కేవలము వచనముగా నున్న యిట్టి గ్రంథమునకు గద్యప్రబంధమని పేరుపెట్టుట సమంజసముగా లేదని యీనాటి విమర్శకులు భావింపవచ్చును.

---

1 దాసు శ్రీరామ మహాకవి – చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి – అయ్యంకి వేంకటరమణయ్య సన్మాన సంచిక – 1956 పుటలు 48 – 61.

కాని శ్రీరాములుగారీ పేరు పెట్టుటలో తమకు ముందుగల వచనగ్రంథ ములను పరిశీలించియే దీని కీ నామధేయ ముంచిరని తెలియగలదు.

క్రీ. శ. 1872 లో కర్నూలు నరహరి గోపాలకృష్ణమ సెట్టిగారు "శ్రీ రంగరాజు చరిత్ర" అను నవల వ్రాసి దానిని ప్రబంధమనియే పేర్కొనిరి.

శ్రీ రంగరాజు చరిత్ర

"PREPACE"

"This attempt to delineate the manners and customs of the Telugus in their language in the form of a novel owes its origin to the announcement by the late lamented viceroy of the offer of a reward for the best story in Bengali illustrative of native life and manners in lower Bengal". 1

:- పీఠిక :-

"పది నెలల నాఁడు లార్డు మేయోగారు బంగాళుల యాచారములు దెలుపు ప్రబంధంబు గావించువానికి బహుమానంబు సేయంబడునని ప్రచురణము చేసిరి. అది నేను వినినపుడు తెలుఁగుదేశమువారి యాచారములు దెలుపునట్టి "ప్రబంధంబొ"కటి రచియించుట తెలుఁగు చదువువారి కుప యుక్తంబగునని తలంచి నా నేర్చు కొలందిని 'ప్రబంధంబు' చెప్పఁబూని తిని. ఇది కేవలము కల్పితంబు. కథానాయకుండు మహాకులీనుండై యుండవలయునని యీ దేశమున మున్ను దొరతనముచేసిన విద్యానగర

1 శ్రీరంగరాజు చరిత్ర - వ్యవహార తరంగిణీ ముద్రాక్షరశాల - 1872 .. మదరాసు.

చూ. : ఆంధ్ర వచన రచనా పరిణామము - రెండవ భాగము పుట 15 అముద్రితము.

రాజవంశమువారిలో శ్రీ రంగరాజనువారి పేరు గైకొంటిగాని యిందు చెప్పిన చరితము యదార్థముగా జరిగినదని యెంచగూడదు.

*　　　　*　　　　*

కేవల గద్యాత్మకమైన తెనుఁగు "ప్రబంధములు" విశేషము లేమింజేసి ఇది తెలుఁగు విద్యార్థులకు సహిత ముపయోగించునని తలంచెద.

కర్నూలు　　　　　　　　　　నరహరి గోపాలకృష్ణమసెట్టి"

ఆంగ్ల పీఠికలో నవల ( Novel ) అనుదానికి తెనుగున-గోపాల కృష్ణమసెట్టిగారు 'ప్రబంధము' "గద్యాత్మక మయిన తెనుగు ప్రబంధము" అని పేరొ్కనుటచేత - శ్రీరాములుగారును - నవలయే వ్రాసి తామును "గద్యప్రబంధము" అనియే తెలిపిరి.

కాని తమకృతికిముందే ఒకగద్యప్రబంధము ముద్రితమై యున్నకతమున దీనికి "అభినవ గద్యప్రబంధము" అని పేరుపెట్టిరి. అభినవము అనగా క్రొత్తది అని అర్థము.

నవలను "గద్యప్రబంధము" అనగానే ఈనాటి విమర్శకులకు నవ్వు రాగలదు. కాని అది గ్రంథరచనారీతి ననుసరించి పెట్టబడినది. ఇందలి శైలి ప్రబంధశైలి - అనగా నిందలి భాషారచన - కావ్యప్రబంధముల ననుసరించి గ్రాంధికభాషలో నుండును.

## చిన్నయసూరి - గ్రాంథికశైలి

విశ్వవిద్యాలయ పఠనీయగ్రంథములలో నిట్టి గ్రాంథికశైలి ప్రవేశపెట్టినవాడు పరవస్తు చిన్నయసూరి. అంతకుముందు సులభ వచనరచన లున్నను - విశ్వవిద్యాలయమున - ప్రథమ శాస్త్రపరీక్ష (Intermediate), పట్టపరీక్ష (బి. ఏ.) లకు తెనుగుకూడ పాఠ్యముగా నుండుటచే ఆ పరీక్ష

లకు తగిన యుత్తమస్థాయిలో వచనగ్రంథము లత్యంతావశ్యకము లయ్యెను.

అత డీ గ్రాంథిక వచనరచన యావశ్యకత గుర్తించి, నాతికఠినము, నాతిసులభము, నిర్దుష్టము, నిరవద్యము నగు గ్రాంథికశైలిలో 'నీతి చంద్రిక' అను గ్రంథమును రచించెను.

మిత్రభేదము, మిత్రలాభము, సంధి, విగ్రహము అను నాలుగు భాగములు గల 'నీతిచంద్రిక' లో నాతడు మొదటి రెండింటిని మాత్రమే రచింపగలిగెను. 1853 వ సంవత్సరమున ప్రకటితమయిన చిన్నయసూరి నీతిచంద్రిక, నవ్యయుగమున గ్రాంథిక వచనరచనకు శ్రీకారముచుట్టినది. నాటినుండి నేటివఱకు అది విశ్వవిద్యాలయ ప్రవేశపరీక్షకు పఠనీయమై యున్నది.

చిన్నయసూరి నీతిచంద్రికయే విశ్వవిద్యాలయ పరీక్షలకు నియతముగా నియమింపబడుటచేత ఆ పరీక్షలకు నీతిచంద్రిక గ్రాంథికశైలిలోనే వచన పఠనీయగ్రంథము లుండవలెనని సంప్రదాయ మేర్పడెను. చిన్నయసూరికి వెనుక మఱి తొమ్మిదేండ్లకు కొక్కొండ వేంకటరత్నము పంతులుగారు చిన్నయసూరి శైలిలోనే విగ్రహతంత్రము రచించిరి. (1871) ఆ వెనుక కందుకూరి వీరేశలింగం పంతులుగారు సంధి విగ్రహ తంత్రములను రెండింటిని రచించి నీతిచంద్రికను పూర్తిచేసిరి. ఈ రెండును చిన్నయసూరి శైలి ననుసరించినవే. (1873-1875) పై వేంకట రత్నముపంతులుగారి విగ్రహతంత్రము, కందుకూరివారి సంధి, విగ్రహ తంత్రములు విశ్వవిద్యాలయ పఠనీయగ్రంథము లైనవి.

"ప్రిన్సు ఆఫ్ వేల్సు హిందూస్థాన సందర్శనము" అను గ్రంథ మును క్రీ. శ, 1877 లో కొక్కొండవారు రచించిరి. ఇది విశ్వవిద్యాలయ ములో పఠనీయగ్రంథ మైనది. 1

అప్పటి వచన పాఠ్యగ్రంథములలో శైలి యెట్లుండెడిదో నిరూపించుట కొక యుదాహరణ నిచ్చుచున్నాను. — పై గ్రంథమునుండి.

"అనవరతశతఘ్నీ ఘోషముచేతను, నానాముఖప్రణాళికానిష్ఠ్యూత నిర్మలజలధారార్ద్రీకృత భూభాగముచేతను, సద్యస్కృత మరకత హరిత విచిత్రపత్రమయకాయమాన మండపప్రాసాద దుర్గ రామణీయకముచేతను, సుప్రవృద్ధ ప్రావృడ్దివసంబన్నట్లు పొడకట్టె.

వేట తమకము, పీటి సింగారము, వయ్యారుల యొయ్యారము, ఒడ్డోలగముల దొడ్డతికము, విందుకుడుపుల పొందిక, పందెముల మేలిమి, పందిళుల యందము, కానికల యింపు, బిరుదుల సొంపు, మూకల పంపు, గుంపుల పెంపు విస్తరిల్లె." 2

శ్రీరాములుగారును పైనీతిచంద్రిక, మిత్రలాభము, మిత్రభేదము, సంధి, విగ్రహ తంత్రముల ననుసరించియె, అభినవ గద్యప్రబంధమును గ్రాంథికభాషలో రచించిరి.

## అభినవగద్యప్రబంధమునందలి విశేషములు

### 1. అవతారిక.

ఇది గద్యప్రబంధ మను పేరు పెట్టుటచే వారు దీనిని ప్రబంధ పద్ధతుల పైనే రచించిరి.

---

1 ఆ కాలములో విశ్వవిద్యాలయ మనగా, మదరాసు విశ్వవిద్యాలయము యొక్కటే యని గ్రహింపవలెను.

2 ప్రిన్సు ఆఫ్ వేల్సు హిందూస్థాన సందర్శనము, పుట:32.

1వ పద్యము పద్యప్రబంధమువలె అవతారిక రచించుట:- అవతారిక పద్యరూపముననే రచితము. ప్రథమమున తంద్రి తన్నయ మంత్రిని విష్ణుమూర్తి బ్రోచుగాత యని దైవస్తుతి.

2వ పద్యము అచ్చతెలుగు:- తెలుగుకవుల, కావ్యములప్రశంస.

3వ పద్యము తెలుగుకవిస్తుతి:- ఇందు ఇరువదిమంది తెలుగుకవులు స్తుతింపబడిరి.

ఉ॥ నన్నయఁ దిక్కనం బ్రగడ నాథు నధర్వణుఁ బెద్ద తిమ్మ సూ
రన్నల సోమ భాస్కరుల రాముని లింగనిఁ బోతరాజు భీ
మన్నను వీరనార్యుఁ గవిమల్లన లక్ష్మణుఁ గొల్చి కృష్ణభూ
పన్నవమూర్తి రామకవిభూషణుఁ జిన్నయఁ బ్రీతి మెచ్చెదన్.

కవులపేర్లు సంగ్రహించుటచే వివరము వ్రాసినగాని సులభముగా తెలియదు.

1. నన్నయ — నన్నయభట్టు 2. తిక్కన — తిక్కన సోమయాజి 3. ప్రగడ — ఎఱ్ఱాప్రెగడ 4. నాథు — శ్రీనాథుడు 5. అధర్వణు — అధర్వణాచార్యుడు 6. పెద్ద — అల్లసాని పెద్దన 7. తిమ్మ — ముక్కుతిమ్మన 8. సూరన్న — పింగళి సూరన్న 9. సోమ — నాచన సోమన 10. భాస్కర — హుళక్కి భాస్కరుడు 11. రాముని — అయ్యలరాజు రామభద్రయ్య 12. లింగని — తెనాలి రామలింగడు 13. పోతరాజు—బమ్మెర పోతన 14. భీమన్న — వేములవాడ భీమకవి 15. వీరనార్య — పిల్లలమఱ్ఱి పినవీరన 16. కవిమల్లన — ప్రౌఢకవి మల్లన 17. లక్ష్మణు — ఏనుగు లక్ష్మణకవి 18. కృష్ణభూపు — కృష్ణదేవరాయలు 19. రామకవిభూషణు — రామరాజభూషణుడు 20. చిన్నయ — పరవస్తు చిన్నయసూరి.

ఒక్క ఉత్పలమాలలో నిరువదిమంది కవులను సంగ్రహించి స్తుతించిన శ్రీరాములుగారి ప్రతిభ యెంతయు గొనియాడదగినది. పై పద్యము

వలన వారు నన్నయనుండి చిన్నయవరకు గల సమస్త కావ్యసాహిత్యమును పరిశీలించినవారని స్పష్టమగుచున్నది.

పై తెలుగుకవిస్తుతిలో శ్రీరాములుగారు చిన్నయసూరిని చేర్చుట యెంతయు సమంజసమై యున్నది. ఆతడు కావ్యములు వ్రాయలేదు గాని కవియే. తక్కినవారు పద్యప్రబంధకవులైన, చిన్నయసూరిగద్యప్రబంధకవి. ఈరీతి జూచినను నీ స్తుతి సహేతుకమే. కొక్కొండవారు కందుకూరివారు తమ వచన కృతులలో చిన్నయసూరిని స్తుతించిరి.

4వ పద్యము ఏడుదినములలో నలుబదిపుటల గ్రంథము నూతనమైనది రచించుట.

5వ పద్యము గ్రంథ నామ సార్థకత.

6వ పద్యము దోషములను పరిగణింపరాదని వేడికోలు.

7వ పద్యము తా మసంఖ్యాకములైన కృతులు రచించినామనియు, ఐదు ప్రబంధములు రచించినామనియు; నావెనుక న్యాయవాది పట్టమునకై ఆంగ్లభాష పట్టము గడించితిననియు, తిరిగి తెలుగు గ్రంథరచనకై పూనుకొంటిననియు తెలుపబడినది.

8వ పద్యము సర్వజ్ఞుడైనవాడు శివు డొక్కడే. ఎన్నోరాళ్లు వడపోసిన గాని వజ్రము దక్కదు. అట్లే సుధీమణులు దీనిలోని గుణములు గ్రహింపుడని వేడికోలు.

9వ పద్యము కృతిరచనాకాలము :- ఈ కృతిరచనాకాలము నాటికి శ్రీరాములుగారు బందరు నిజాంపేటలో నుండిరి.

రచన :- వృషభాను రాధ శాక శకని ౩ - వృషభాను సంవత్సర వైశాఖ శుద్ధ పూర్ణిమ - (1889 - ఏప్రియలు నెల).

## 2. వర్ణనలు

పద్యప్రబంధములవలె నిది శ్రీకారముతో ప్రారంభమైనది. ఇందు ప్రబంధమునకు నియమితమైన వర్ణనలు కొన్ని గావింపబడినవి. ప్రబంధములో అష్టాదశ లేక పదునెనిమిది వర్ణన లుండవలెనని ఆలంకారికులు నిర్ణయించిరి. కాని వానిలో కొన్ని లేకపోయినను ప్రబంధత్వమునకు లోపము రాదని వారే దాని కపవాదము దెల్పిరి.

ఇక నీ గద్యప్రబంధమున వర్ణనలను పరికింతము.

నాయక వర్ణనము – పుట 7. నాయికా వర్ణనము – పుట 7. వసంతఋతు వర్ణనము – పుట 8. వనకేళీ వర్ణన – పుట 9. సూర్యాస్తమయము, చంద్రోదయము – పుట 13. అటవీ వర్ణనము – పుట 18 కాసార వర్ణనము – పుట 19. జలకేళీ వర్ణన – పుటలు 19, 20. సముద్ర వర్ణన – పుట 43. విరహము – పుట 49. వివాహము – పుట 51. దౌహద్యము – పుట 54.

ఇంత చిన్నగ్రంథమున సందర్భశుద్ధిగా, సమయోచితముగా నిమిడించి రచించిన గ్రంథకర్తల ప్రతిభ ప్రశంసనీయము. వర్ణనలేకాక, యీ క్రింది విషయములు నిందు ప్రపంచితము లైనవి.

మాతృప్రేమ – పుట 26. యోగవర్ణన – పుట 31. చతుర్దశ విద్యలు, కళలు – పుటలు 31, 32. చార్వాకవాదము – పుటలు 41, 42 ఇందలి కథానాయకుడు మహాకులీనుడు.

## 3. శైలి

ఇందలి శైలి సంస్కృతాంధ్ర పద సమిశ్రితమై రసానుగుణ్యముగ నున్నది.

సంస్కృత సమాస రచన :—

సంస్కృత సమాసములను రౌద్రరసమును వ్యక్తీకరించుట కుపయోగించిరి. ఇది యెంతయు నుచితము. సమాసములులేనియెడల సహకు

రసస్ఫూర్తి గలుగదు. "ప్రళయకాలాభీలకీలికీలామాలామూలంబైన కాకోలంబు గ్రక్కుచు, యోజనాయతఫణసందీప్త మాణిక్యచ్ఛటాచ్ఛటలు దిక్తటంబుల నటింప". (పుట 45).

కాసార వర్ణన :—

"అనేక చక్రవాక బలాహకాప్రముఖ సర్వతోముఖ పతత్రిసంసేవితంబును, కమలకుముదకల్హారాది నానావిధ ప్రసూనప్రవితాన విరాజమానంబును పారోపలచారుస్థల సారామల భూరుట్పల విలసితంబును, వినిర్మల మధుర పానీయ పరిపుష్ట సకల జంతువారంబును నగు నొక్క కాసారంబు". (పుట 19).

తెలుగు - కరుణ రసము :—

కనకవల్లి సుతునిగూర్చి విలపించుట.

"ఇది యేమి? నా చిన్నియన్న యిట్లున్నవాఁడు. పది నెలలు మోచి పలు వేసటల పాలై ఇన్ని దినంబులు నీవ మా కేడుగడ యని, బహువిధంబుల పరిరక్షించుకొన్న నా కడుపుపంటా! నీ తండ్రి దండింప నా కేల చెప్పక పోతివి? నా తండ్రీ! యెచ్చటికి నేగి యాఁకటి కోర్వలేక కడు నడలితివో? ననుం దిట్టితివో? నే నేమిసేతు నాకూనా! నీ మెత్తని పలుకు లేమాయె? ఈలీల మాతోడఁ బలుకక బడియున్న కారణంబేమి? లేలెమ్ము! నా ముద్దులన్నా! యొక ముద్దు వెట్టుము. నా వీనుల నీ పలుకులతేనె లేల నిండింపవు?". (పుట 28).

4. జాతీయములు : సామెతలు

ఇందు రచనారీతికి తెలుగుదనమును గల్గించుటకు జాతీయములు, సామెతలు వాడబడినవి.

కాలికిఁ బెట్టిన వ్రేలికి వచ్చు - పుట 15. ఈఁతకు మిక్కిలి లోతు లేదు - పుట 18. అతలేక మద్దెల యోతన్నట్లు - పుట 19. మ్రింగ మెతుకులేదు మీసాలకు సంపెంగనూనె - పుట 21. ఈనంగాచి నక్కల

పొలగుట - పుట 24. నోట ప్రేలిడిన గఱవ నేరవు - పుట 27. తను గట్ట త్రాళ్లు తా దెచ్చుకొన్నట్లు - పుట 38. పంటిక్రిందికి యూరుగాయ - పుట 38.

### 5. సూక్తులు

సంస్కృతమున ప్రసిద్ధములైన సూక్తు లిందు గలవు.

గతజలసేతుబంధనము - పుట 13. శ్రేయాంసి బహూ విఘ్నాని- పుట 15. నందోరాజా భవిష్యతి - పుట 38. ధర్మో జయతి - పుట 44. ఏకక్రియా ద్వ్యర్థకరీ - పుట 43.

### 6. రచనావిశేషములు

అవతారికలో :

ఆ॥ వె॥ కల్లకతలు వన్ని కబ్బ మొక్కటి గట్టె
నొల్ల మనుచుఁ దప్పు లున్నవనుచు
జెల్లి యున్నవారు చేరి వవ్విన నొప్పు
పిల్లవారిపట్ల పెద్దలట్ల.

ఇది ఆటవెలదిలో ప్రాస పాటించుట విశేషము.

శబ్దాలంకారము - వృత్త్యనుప్రాసము :—

ఇరులో, మధుకరులో, జలధరులో, యా తలోదరుల కురుల నెన్న నే కవివరుల తరము ? (పుట 7).

అర్థాలంకారములు - ఉపమాలంకారము :—

పాలును నీరునుం బోలెఁ గలసి మెలసి, పూలం దావిమాడ్కిఁ బూసల దారంబురీతిఁ దమపొందుం జెందిరి.... (పుట 7).

పర్యాయపదములు :—

గ్రంథకర్తలిందు కొన్నింటికి-క్రొత్త పర్యాయపదములు గల్పించిరి.

హొత్తకాండ్రు - గ్రంథకర్తలు. గద్దెపుసుద్ది - వచనసూక్తి. ఱెక్కదారి - పక్షి. అభ్రపుష్పము - గగన కుసుమము

## 7. సంప్రదాయ పరిజ్ఞానము

గ్రంథము చిన్నదైనను సంప్రదాయ సిద్ధమైన భారతీయ పరిజ్ఞానము గలుగం జేయుటయం దిదిపెద్ద.

వేదవేదాంగాది విద్యలనుగూర్చియే గాక, వేదాంత విషయము లిందు గలవు. శుక చార్వాక సంవాదము. (పుటలు 41, 42)

పూర్వము లేఖలు వ్రాయునపుడు - బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రులకు నే విధముగా వ్రాయవలెనో ఇందు సూచింపబడినది.

ఇచట బ్రాహ్మణునికి లేఖ గాన - ఆ లేఖా ప్రారంభము చూపుచున్నాను.

"శ్రీమద్యజన యాజ నాధ్యయ నాధ్యాపక దాన ప్రతిగ్రహ షట్కర్మ నిరతులైన ప్రభాకర భూసురేంద్రుల సమ్ముఖమ్మునకు—" (పుట 50)

## 8. జ్యోతిశ్శాస్త్ర పరిజ్ఞానము

గ్రంథకర్తలగు శ్రీరాములుగారు కవితాకళయందేగాక ధర్మశాస్త్రమున, జ్యోతిశ్శాస్త్రమున ప్రవీణులు. ఈ గ్రంథమున నీ క్రింది జ్యోతిశ్శాస్త్ర సాంకేతిక పదజాలము పరిశీలించిన వారికాశాస్త్రమునంగల ప్రావీణ్యము తేటపడును. [1]

"శుభగ్రహంబు లేకాదశస్థాన గతులును, గ్రూరగ్రహంబులు త్ర్యాయారిగంబులునై యుండ విచారించి తారాబల చంద్రబలంబులుగల యొక శుభదినంబున" (పుట 51)

"తిథి వార నక్షత్ర యోగ కరణ లగ్న హోరా ద్రేక్కాణ నవాంశ ద్వాదశాంశ త్రింశాంశలు శుభదంబులై యుండ స్వక్షేత్ర మిత్రక్షేత్ర స్వ

---

1 ప్లవ సంవత్సరమున ( 1901 ) అధికాషాఢ నిర్ణయచర్చ జరిగిన సందర్భమున యావదాంధ్రదేశమున జ్యోతిశాస్త్రజ్ఞులు పాల్గొనిరి. ఆ మహా సభకు శ్రీరాములుగారే అధ్యక్షులు.

పరమోచ్చల సూర్యాది గ్రహ సప్తకంబు ప్రకాశింప మహారాజ యోగంబున" (పుట 54)

ఇందు మహారాజయోగ జాతకము సూచింపబడినది.

## 9. కావ్యాంత విశిష్టత

ఈ గ్రంథమునకు నంతమునందుగల నవసుధాధీశవిఖ్యాక, కవీరస భామాత్ర, తమోహరహిత, తతనయాశ, భవనగ, గజప, పశ్రీ అను పదములకు విశేషార్థము గలదు.

"మంగళాదీని, మంగళమధ్యాని, మంగళాంతాని" అను నార్య సంప్రదాయము ననుసరించి, ఇది శ్రీకారముతో ప్రారంభమై, శ్రీకారముతో సమాప్తమైనది. ఇది ప్రాచీన సాహిత్య సంప్రదాయమె - నన్నెచోదకవి కుమారసంభవమున శ్రీకారముతో కృతి ప్రారంభించి, మంగళమహా శ్రీవృత్తముతో ముగించినాడు. దీనిని ప్రాచీన కవులు కొంతమందియే పాటించినారు. [1]

నవ్యయుగమున తిరిగి గద్యప్రబంధమున పై సంప్రదాయమును పాటించినవారు శ్రీరాములుగారే.

పై పదములలో ముక్తపదగ్రస్తాలంకారము గలదు -

పై పదముల కర్థ మున్నగాని అందలి విశేషము సుగమము కాదు. ఇట్టివాని కర్థము వ్రాయుట యన్న సామాన్యమైన పనికాదు - సంస్కృత భాషయందు కూలంకషమైన పాండిత్య మున్నవారికే సాధ్యము - అట్టివారు శ్రీ పన్నాల సీతారామబ్రహ్మశాస్త్రి. ఈయన యర్థముతో నిందు ప్రకటిత మగుట యెంతయు ప్రశంసనీయమైనది - కాని యింతవఱకు నీ పండితుని గూర్చి ఆంధ్ర సాహిత్యలోకమునకు పరిచితముగాదు. కావున నీ యవకాశము పురస్కరించుకొని ఆతని జీవిత విశేషములు గ్రంథాంతమందు తెలియ జేయబడినది.

---

1 ఉదాహరణ : వాఙ్మయచరిత్ర - ద్వితీయముద్రణము 1968 - పుట 36

# 10 రచనోద్దేశము

అభినవగద్యప్రబంధము విశ్వవిద్యాలయ పరీక్షలకొఱకే ప్రత్యేకముగా రచితమైనను, ఆకాలమునందలి వచనగ్రంథరచనావిధానము ననుసరించి, విద్యార్థులకేగా కవిద్వాంసులకుగూడ నుపయుక్తమగునట్లు నిర్వహింపబడినది. పూర్వకాలమున పాఠ్యగ్రంథము లిప్పటివలె, కేవలము, పరీక్షయందు కృతార్థత చెందుటకొఱకే గాక, సమధిక భాషాజ్ఞానము గలిగించి భావములను, స్వయముగా, విద్యార్థులు వ్యక్తముచేయుటకు, తగిన సామర్థ్యమును గలుగ జేసెడివి.

ఇట్టి మహోద్దేశముతో రచితిమైన యీ యభినవగద్యప్రబంధమును, ఈనాడు తిరిగి సాహిత్యలోకమున ప్రకాశింపజేసిన – ప్రకాశకులగు వారి పౌత్రులను నత్యంతము నభినందించు చున్నాను.

ఈగ్రంథ విశిష్టతను గమనించి విశ్వవిద్యాలయాధికారులు, దీనిని పాఠ్యగ్రంథముగా నొనరించి, ప్రకటనకర్తలకు ప్రోత్సాహమునిచ్చి, గ్రంథవ్యాప్తికి దోడ్పడి కృతికర్తలైన శ్రీరాములుగారి కీర్తి చిరస్థాయి చేయుదురుగాక.

ఇట్లు,
నిడదవోలు వేంకటరావు.
7-7-1973

# దాసు శ్రీరామ పండితుని జీవిత చరిత్ర సంగ్రహము

ఈకవి అర్వేలనియోగి బ్రాహ్మణుడు. హారితసగోత్రోద్భవుడు. తండ్రి కన్నయమంత్రి. తల్లి కామాంబ.

వీరు 1846 వ సంవత్సరమున కృష్ణాజిల్లా గుడివాడ తాలూకాలోచేరిన కూరాడ యను గ్రామమందు మేనమామలయింట జననమొంది 1908 వ సంవత్సరములో గోదావరిజిల్లా ఉప్పు యేలూరులో స్వగృహమున మృతినొందిరి. కృష్ణాజిల్లా కైకలూరు తాలూకా అల్లూరు అను గ్రామము వారి పూర్వులకు అప్పటి ప్రభువు లొసంగిన యగ్రహారమయి తలిదండ్రుల పాలనలో నుండుటచే వీరికి జీవనము సుఖముగ జరుగుచుండెను. మరియు తలిదండ్రులకు వీరొక్కరే సంతానమగుటచే జన్మాది వీరిని తలిదండ్రులు విడువక తమయొద్దనే యుంచి మిగుల గారాబముతో పెంచుకొనుచుండిరి. బాల్యమున నాయూర లభించిన విద్యను సంపాదించిరి. పిమ్మట తొమ్మిదవయేట నాంగ్లేయ విద్యాభ్యాసము కొరకు చేరువను పెద్దపట్టణమగు మచిలీబందరునకు బంపబడిరి. అచ్చట నోబిలు పాఠశాలలో నింగ్లీషును, నింటియొద్ద పారశీభాషయు జదువుచుండ పదిమాసములు గడచెను. ఈ చిన్నవాని కుశాగ్రబుద్ధియు, సత్ప్రవర్తనయు పాఠశాలాధ్యక్షులగు నోబిలు దొరగారి మనస్సునకు కడు

సంతస మొనర్చుటచే నీ పిల్లవానిని దొరగారు తన గృహ మున కప్పుడప్పుడు గొంపోయి చిన్నపుస్తకములనిచ్చియు ఫలహారముల నొసంగియు కడు గారాబాముతో నాదరించుచు వచ్చిరి. ఆ దినములలో కొందరు విద్యార్థులు క్రైస్తవమతా వలంబనము చేయుచుండుట తటస్థించెను. ఈ యుదంతము లన్నియు క్రమక్రమమున వారి మాతాపితలకు దెలియవచ్చి నవి. వెంటనే తల్లిగారు మచిలీబందరు వచ్చి యీ చిన్న వానిని ఆకస్మికముగా స్వగ్రామమునకు మరల్చుకొని పోయిరి. కాని యంతటితో నీపిల్లవాని విద్యాతృష్ణ యెంత మాత్రమును తగ్గలేదు. ఆయూరనున్న వీరి మేనత్తకుమారు డగు ఉప్పలూరి కనకరాజుగారి సహాయమున కొన్ని యాంధ్రగ్రంథములును, ఛందస్సును బఠించి కవితారచన యందు నేర్పరులైరి. జ్యోతిశ్శాస్త్ర సాంప్రదాయములను జాలవరకు గ్రహించిరి. 12 వ యేట సోమలింగేశ్వరశతక మును ప్రౌఢశైలిలో వ్రాసిరి. అష్టావధానము, వ్యస్తాక్షరి, శతఘంటాకవనము ధారాళముగ నొనర్చు కౌశల మబ్బినది.

అంతట గీర్వాణభాషాభ్యసనకుతూహలము వారి మనము నెంతయు గలగించుటచే తలిదండ్రుల యెరుకలేకుండ నొకనాటి రేయి నూరువిడచి జమీందారి సంస్థానమగు నూజవీడునకు బోయిరి. అప్పటి సంస్థాన విద్వాంసులగు శ్రీమాన్ విద్వాన్ మాడభూషి వెంకటాచార్యులుగారు ఈ పిల్లవాని విద్యాబుద్ధులను బ్రశంసించి "పదిరెండేడుల యీడునం గవిత జెప్పంజొచ్చి వ్యస్తాక్షరీ" యను బద్యమును నాశువుగా జదివి వీరి ననేక భంగుల గౌరవించి కొన్ని మాసము లచ్చటనిల్పిరి. పండితసహవాసమువలన గీర్వాణ

ముందు కొంచెము ప్రవేశము గలుగజేసికొనిరి. అంతట స్వస్థల మగు అల్లూరునకు దిరుగ గొంపోబడి యచట రెండు సంవత్సరము లుండిరి. ఆంధ్రగీర్వాణజ్ఞానము క్రమక్రమముగ వికసించెను. సాత్రాజితీవిలాసమను యక్షగానము రచించిరి. ఇందలి కవిత్వము మిగుల లావణ్యమును ప్రౌఢమునునై యొప్పె. ఇప్పుడు వీరి వయస్సు 14 వర్షములు. ఆదినములలో వల్లూరు సంస్థానాధీశ్వరులగు రాజా నాగన్ననాయుడు గారు నవరాత్రోత్సవములు కడు వైభవముతో నొనర్చుచు పండిత సంభావనాది సుకృతులచే విద్వలను బోషించుచుండిరి. తన్మహోత్సవసందర్శనకుతూహలముచే నీ బాలకవి పై జెప్పబడిన సంస్థానమునకేగి, యాస్థానపండితశిరోమణియగు శ్రీ మతుకుమల్లి నరసింహశాస్త్రిగారిచే నొసంగబడిన సమస్య నొకదాని నవలీల బూరించి యాపండితుని మనము నెంతయు సంతసింపజేసెను. అందరితోపాటు ఈ చిన్న వాడును పరీక్షింపబడి యగ్రసంభావన బడసెను. ఈయేటనే వీరు తమ పెద్దమేనమామ పుత్రికయగు "జానకి" ని వత్నిగా గైకొని పరిణయ మొందిరి. ఆ పతివ్రతా శిరోమణి గర్భమున వరుసగా నార్వురు పుత్రులును నొక పుత్రికయు నుదయించిరి. పిమ్మట నాలుగైదు సంవత్సరములు స్వగ్రామముననే నిలచి స్వయంకృషిచే ఆంధ్రగీర్వాణగ్రంథముల సాధించి విజ్ఞానమును గాంచిరి. కొన్ని గ్రంథములనుగూడ రచించిరి. పంచనృసింహక్షేత్రము, శుకరంభాసంవాదము, కృష్ణార్జునసంగరము, సారసంగ్రహగణితము వానిలో చేరినవే.

మరల 18 వ యేట నింటియొద్ద నెవ్వ రెరుంగకుండ నొక స్నేహితుని వెంట దోడ్కొని "గీర్వాణవిద్యాపీఠ"మని

నుతికెక్కిన ఆగిరిపల్లికిబోయి యచటిపండిత సహాయమున గొన్ని సాహిత్య గ్రంథములను, సిద్ధాంతకౌముది గొంత వరకు జదివిరి. పిమ్మట గొంతకాలమునకు స్వగ్రామము జేరి సుఖముగ గాలము గడపిరి. మువ్వురు కుమాళ్ళు బుట్టిరి. అంత గొందరు స్నేహితులవలన బ్రోత్సహింపబడి తాలూకాపట్టణ మగు గుడివాడకుబోయి యచటి పాఠశాలలో ప్రధానాంధ్రోపాధ్యాయులుగ జేరి యాంగ్లేయ విద్యాభ్యాసముజేసి రెండేండ్లలో మెట్రిక్యులేషను తరగతికి దగిన జ్ఞానమును సంపాదించిరి. ఇదియంతయు స్వయంకృషియే. చెన్నపురి యందు ఆంధ్రులలో సుప్రసిద్ధిగాంచిన శ్రీ రెంటాల వెంకట సుబ్బారావుపంతులుగారు వీరియాంతరంగిక శిష్యులలో ప్రథములు.

గుడివాడ పాఠశాలలో వీరు కనుపరచిన బోధనా ప్రజ్ఞ కడు ప్రశంసనీయమని తోచుటచే తత్సమీపగ్రామములగు కౌతరము, డోకిపఱ్ఱు గ్రామవాస్తవ్యులలో బ్రముఖులగు గొందరు కమ్మవారు వీరిని వారిగ్రామములకు రప్పించి పాఠశాలను స్థాపించి యనేకులు బాలురను విద్యార్థులుగ జేర్చిరి. ఆంధ్రగీర్వాణాంగ్లేయములు మూడు భాషలయందును విద్యను గఱపుచుండిరి. గవర్నమెంటువారు మొదటి సంవత్సరము రు 500లు రెండవ సంసత్సరము రు1000లు గ్రాంటొసంగిరి. సంవరణోపాఖ్యానమును కావ్యమును, లక్షణావిలాసమను యక్షగానమును ఈదినములలో రచించిరి. తెలుగుభాషలో సెకండుగ్రేడుప్లీడరు పరీక్షకుగావలసిన గ్రంథములను జదివి దానియందు త్తీర్ణులైరి. అంతట వీరు న్యాయవాదిగ మచిలీబందరు పోవలసి వచ్చెను. అప్పుడా గ్రామనివాసులు వీరి యెడల

జూపిన విశ్వాసమును గౌరవమును అసమానములు. వెండి పూలచే పాదములను బంగారుపూలచే శిరమును బూజించి సాష్టాంగ నమస్కారము లొనర్చి పల్లకిలో నెక్కించి ఇరు పార్శ్వములను జ్యోతులను వెలిగించి తమభుజములపై పల్లకిని మోసికొని వీథుల నూరేగించిరి.

వీరు డోకిపఱ్ఱులోనున్న కాలమందు జరిగిన యొక విషయముమాత్ర మీసందర్భమున నుదాహరించవలసియున్నది. దానివలన వీరి పట్టుదలయు, బరోపకారబుద్ధియు విద్యాభిమానమును వెల్లడియగుచున్నవి. సూరి సీతారామశాస్త్రి యను నొకచిన్నవయసుగల వైయాకరణి ధనార్థియై వీరి కడకువచ్చెను. ఆ శాస్త్రి నాయూరనే నిలిపి తాను ఆయనకు అన్నవస్త్రములిచ్చి ఆంగ్లేయభాషను గొంతవరకు గఱపెను. మరియు తెలుగు ప్లీడరీకి గావలసిన గ్రంథములను బఠింపించెను. పిమ్మట రెండుసంవత్సరములు ఆ శాస్త్రి కృషిజేసి ప్లీడరయి గుంటూరుజిల్లా కారెంపూడిలో న్యాయవాదిగానుండి ధన మార్జించి సుఖజీవి యయ్యెను. ఆ శాస్త్రిగారియొద్ద వీరు సిద్ధాంత కౌముది, శబ్దేందుశేఖరము మొదలగు గ్రంథములను జదువుచువచ్చిరి. బందరులో న్యాయవాదిగనున్న కాలమున వీరి వయస్సు ముప్పది రెండు. ఆరుగురు కుమాళ్ళును నొక కుమార్తెయు గల్గిరి.

వీరి యూహాలను ఆశయములును కాలానుసారముగ మార్పు జెందుచు వచ్చెను. సంఘ సంస్కరణ విషయములో

వీరు చాల కృషిచేసిరి. 1880 సంవత్సరములో "కల్పవల్లి" యను నొక పత్రికను ప్రకటించుచు విధవావివాహము, నౌకాయానము మొదలగు విషయములను జర్చించుచు ననేక యుపన్యాసము లొసంగిరి. అంతట మునసబుకోర్టు ప్లీడరీతో వీరికి దనివితీరక జిల్లాకోర్టులో న్యాయవాదిగా నుండవలెనను కుతూహలము బలమైనది. వెంటనే యింగ్లీషు జనరల్ టెస్టుపరీక్షలో కృతార్థులైరి. పిమ్మట సివిల్ హాయర్, క్రిమినల్ హాయరు పరీక్షలలోగూడ విజయమందిరి. ఇవియే జిల్లాకోర్టు వకీలునకు గావలసిన పరీక్షలు. పట్టాను పొందుటకు సిద్ధముగనున్న సమయమున దొరతనమువారు మరియొక శాసనమును బ్రకటించిరి. అందువలన నీమూడు పరీక్షలు ప్యాసైనను, 'ఫస్టుగ్రేడు ప్లీడరీ' యను నాల్గవ పరీక్షను కూడ సాధించినగాని జిల్లాకోర్టున కధికారము గలుగదు. కావున నీక్రొత్తపరీక్షకు కృషిచేయవలసివచ్చెను. దీనికి నిర్ణయింపబడిన గ్రంథములు సంఖ్యకెక్కుడును, కఠినములునై యుండెను. 1883 సంవత్సరములో దీనినిగూడ సాధించిరి. అప్పటికి వీరిపుత్రు లార్గురును పాఠశాలలో జదువుచున్నారు.

వీరు ఫస్టుగ్రేడు ప్లీడరు పరీక్షకు మిక్కిలి పట్టుదలతో గృషిచేయుచున్న సమయమున వీరి సామర్థ్యమును బరీక్షింపగోరి స్నేహితుడొకడు వచ్చి 'మిత్రమా! నీవు ఆంధ్రగీర్వాణముల పరిశ్రమవదలి కొన్నియేండ్లయినది. ఇప్పుడు ఆంగ్లేయ గ్రంథపఠనయు ఉద్యోగ కార్యనిర్వాహణమును నీకవశ్య

కర్తవ్యములై యున్నవి. ఇట్టి సందర్భమున వెనుకటి నీ ప్రజ్ఞను బరీక్షింపవచ్చితి. నాసాహసమును మన్నింపుము, నా కోరిక దీర్పుము. ఏమన అపూర్వమైన నూతనకథ నొక దాని గల్పించి యఖిలర్ణనముల సుందరమై పట్టపరీక్షకు జనువు విద్యార్థులకు బఠనీయమై యొప్పుదానిని గద్యమున నేడునాళ్ళలో నలువది పుటలలో ముగించుడు.' మిత్రుని వచనముల కించుక యోజించి వల్లెయని యుత్తరమొసంగెను.

"కం॥ ధరణిని లేనిది యెపుడె
వ్వారివలనను వినని దఖిల వర్ణనముల సుం
దరమగు చరితము గద్యము
న రచించవె నేడునాళ్ళ నలుబది పుటలన్ ॥

అట్లే యేడవనాటికి గ్రంథమును బూర్తిచేసి మిత్రుని కొసంగిరి.

**1884**వ సంవత్సరములో జిల్లాకోర్టు పట్టాను పొంది ఏలూరు సబార్డినేటు కోర్టులో పండ్రెండు వత్సరములు అవిచ్ఛిన్నముగ నుద్యోగమును నిర్వర్తించిరి. అప్పటి న్యాయవాదులలో గొప్ప ఖ్యాతివహించి చాల ధన మార్జించిరి. కాని యాధనమునంతయు ధర్మకార్యములయందే విని యోగపరచిరి. చాలవరకు వారుచేసిన దానములు గుప్తములు, సంగీతమందు వీరికి మిగుల యభిరుచి. వీరి పోషణలో గానపాఠశాలయొకటి యుండెను. పేట్రియాటిక్ మిడిల్ స్కూలు ఏలూరులో వీరిచే స్థాపింపబడి పోషింపబడియె. సామాన్యముగ సకల శాస్త్రములయందును వీరికి ప్రవేశము

గలదు. సంగీతమందును అభినయమందును వీరు వ్రాసిన గ్రంథములు చాలగలవు. గాయకు లనేకులు వీరివలన సన్మానముల బడసిరి. జ్యోతిషమందు వీరికిగల జ్ఞానము అసాధారణ మని యీ క్రింది విషయములనుబట్టి గ్రహించవచ్చును. 1901వ సంవత్సరములో శ్రావణమాస మధికమా ఆషాఢ మాస మధికమాయను చర్చ రాజమహేంద్రవరములో జరిగెను. దీనిని బరిష్కరించుటకు ముగ్గురు తీర్మాన కర్తలేర్పడిరి. అందులో శ్రీరామ పండితులొకరు. తుదకు వీరి వాదనయే సిద్ధాంతీకరింపబడియె. తర్క శాస్త్రమందు "న్యాయబోధ" యను గ్రంథమును వ్రాసిరి.

వైశ్యధర్మములను చర్చించి ఇప్పటి వైశ్యులు ద్విజులనియు వేదోక్త కర్మ కర్తులనియు సిద్ధాంతపరచి యనేక యుపన్యాసములనిచ్చి తుదకు "వైశ్యధర్మదీపిక" యను గ్రంథమును వ్రాసిరి. పండిత సన్మానమందు వీరికి ఉత్సాహ మధికము. తిరుపతి వేంకటేశ్వర కవులు మొదలగు మహనీయులు గొందరు వీరివలన గొప్ప సన్మానములను బొందిరి.

వీరి సంతానములో గడగొట్టగు శ్రీమతి శారదాంబ 1899వ సంవత్సరములో మృతినొందుటచే మనమించుక కలిగి వీరికి ప్రాపంచిక సుఖములందు విముఖత్వమేర్పడెను. శారదాంబ ఆంధ్రగీర్వాణములయందును, సంగీతమందును వీణా వాద్యమందును సమర్థురాలు. ఈమెచే రచింపబడిన

"నాగ్నజితీ పరిణయము" మొదలగు గ్రంథములు కొన్ని గలవు. శ్రీరామపండితులు ఆన 1900 సం॥ మార్చి నెలలో దేవీభాగవతాంధ్రీకరణము నుపక్రమించి యైదు మాసములలో బూర్తిజేసి యారవమాసమున శుద్ధప్రతిని లిఖించి ముద్రణకొసంగిరి.

పిమ్మట స్వస్థలమగు అల్లూరునకు బోయి సోమేశ్వర స్వామికి ఆలయమును గట్టించిరి. తరువాత కొలదికాలము ఉత్తరసర్కారుల యందును, నైజాము రాష్ట్రమందును పర్యటన మొనర్చి యనేక విషయములనుగూర్చి యుపన్యాసముల నిచ్చి 1908 సంవత్సరము మే నెలలో యేలూరులో కాలధర్మము నొంది దివికేగిరి.

బెజవాడ
1-10-1928

దాసు కేశవరావు.

# నివేదనము

క్రీ. శ. 19వ శతాబ్ది ఉత్తరార్ధమున తెలుఁగు దేశమునజీవించి ఆంధ్రసాహిత్యమును తమ అమూల్యమైన రచనలచే అలంకరింపఁజేసిన మహాకవులలో శ్రీ దాసు శ్రీరాములుగా రొకరు. వారు న్యాయవాదవృత్తి చేప ట్టినను ఆంధ్రభారతీసమారాధనమును సంతతము తమ కవితావృత్తిగా సాగించిన మేటికవులు. గీర్వాణాంధ్రాంగ్లపారశీభాషాకోవిదులు. శ్రీరామకవి కవితావ్యవసాయము శ్రీనాథ కవివలె పంద్రెండవ యేటనే ప్రారంభమైనది. శతకములు, ప్రబంధములు, పురాణములు, నాటకములు, శాస్త్రగ్రంథ ములు – ఇట్లెన్నో ప్రక్రియలలో వారు కావ్యరచనలు గావించియుండిరి. వారి శతకములలో సోమలింగశతకము, రఘునాథశతకము, సూర్యశతకము, చిలుకలకొలికి శతకము, ముద్దులగుమ్మ శతకము, సంస్కృత కామాక్షి శతకము మొదలగునవి ప్రసిద్ధములు. కావ్యములలో – సాత్రాజితీవిలా సము, కృష్ణార్జునసంగరము, పంచనృసింహక్షేత్ర మాహాత్మ్యము, లక్షణావిలాసము, మొదలగునవి యెన్నఁ దగినవి. తెలుఁగులో వీధిప్రక్రి యకుఁజెందిన 'తెలుఁగునాడు' ప్రత్యేకముగా బేర్కొనదగినది. వీరి నాటకములలో మంజరీమధుకరీయము, మనోలక్ష్మివిలాసము, కురంగగౌరీ శంకరము, ఆంధ్రీకృత శాకుంతలము, రత్నావళి, మహావీర చరితము, ముద్రారాక్షసము, ఉత్తరరామ చరితము మొదలగునవి ముఖ్యములైనవి. వీరి రచన లన్నియు నొకయెత్తు వీరి దేవీభాగవత పురాణ మొక్కటి యొకయెత్తు. ఆంధ్రమున వెలసిన దేవీభాగవతములలో దీనికున్న ప్రాశస్త్య మనన్యసామాన్యము. వారికి మహాకవి గౌరవమును కల్పించు గ్రంథరాజము దేవీభాగవతము.

మహాకవి దాసు శ్రీరాములుగారు ఆధునికాంధ్రకవిత్వ యుగ కర్తలైన తిరుపతి వెంకటకవుల ప్రశస్తి నందినవారు. వారి దేవీభాగవ

తము, తెలుఁగునాడు కృతులలోని పద్యము లిప్పటికిని పండితుల నాలుకలపై నాట్యమాడుచున్నవి, ఇంతటి ప్రజాదరణ బొందిన శ్రీరామ కవీంద్రుల కృతు లిప్పుడు పాఠకలోకమున కందుబాటులో లేవు. వానిని పునర్ముద్రించి ప్రజలకందింపవలసిన యవసర మెంతైన కలదు.

ఈ యవసరమును దృష్టియందుంచుకొని, దాసు వంశమునందు జన్మించి ఆ మహాకవి యశస్సును వారసత్వముగా ననుభవించుచున్న మేమందరము కలిసి మహాకవి శ్రీ దాసు శ్రీరాములు స్మారక సమితి, హైదరాబాదులో 1973వ సం॥డిసెంబరు నెలలో స్థాపించితిమి. ఆ మహా కవి గ్రంథములను ప్రచురించుటద్వారా వారి సాహిత్యమును నేటి తర మున కందుబాటులో నుండునట్లు చేయుట, వారి పేరు చిరస్థాయిగా నుండు నట్టి ప్రజాహితోపకారములైన కొన్ని ప్రణాళికలను చేపట్టుట – అనెడి లక్ష్యములతో ఈ సమితి కృషి నారంభించినది.

మహాకవి దాసు శ్రీరాములు రచించిన తెలుఁగునాడు తెలుగునాట ఆబాలగోపాలము నలరించిన పద్యగ్రంథము. క్రొత్తపద్ధతిలో నడచిన వీధి. తెలుగువారి నాటి యాచార వ్యవహారములను దెలియుట కుపకరించు కవితాకరదీపిక. అందువలన దాని నీ ప్రచురణ కార్యక్రమములో మొదటి గ్రంథముగా వెలువరించుట జరిగినది. రెండవదిగా అభినవగద్యప్రబం ధమును చదువరుల కందించుచున్నాము. ఆ తరువాత దేవీభాగవతము ముద్రింపవలెనని ప్రయత్నములు జరుగుచున్నవి. క్రమముగా వారి ముద్రితాముద్రిత గ్రంథముల నన్నింటిని ప్రచురించి ప్రజల కందించుట ఈ సమితి మొదటి ధ్యేయము.

ఈ సమితి కార్యకలాపముల మాకు తీర్చిదిద్దుటలో తోడ్పడుచున్న పెద్దలు శ్రీ దేవులపల్లి రామానుజరావు, ఆచార్య దివాకర్ల వేంక టావధాని, కళాప్రపూర్ణ ఆచార్య నిడదవోలు వేంకటరావు, డా॥ పాటిబండ మాధవశర్మ, డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం, శ్రీ దిగవల్లి వేంకట శివరావు,

డా. గూడూరి నమశ్శివాయగార్లకు మా కృతజ్ఞతలు. శ్రీరామకవి ప్రచురణ కార్యక్రమమునకు ఆర్థికముగా సహాయపడిన వదాన్యులకు మా హార్దిక కృతజ్ఞతాభివందనములు.

శ్రీ దాసు శ్రీరామకవిని గూర్చిన విశేషాంశములుగాని, వారి లిఖిత ప్రతులుగాని, పాతప్రచురణలుగాని ఎవరైన సేకరించియున్నచో వానిని ఈ సమితికి అందజేసి ఆ మహాకవి సాహిత్యప్రచురణకార్యక్రమమును దిగ్విజయము చేయ ప్రార్థించుచున్నాము.

అభినవగద్యప్రబంధమున ముద్రణాస్ఖాలిత్యములు లేకుండు నటుల సరిచూచిన శ్రీ విశ్వనాధ వేంకటేశ్వర్లుగారికి కృతజ్ఞతలము. స్వల్ప వ్యవధిలోనే సుందరముగా సచ్ఛాపించి యిచ్చిన శ్రీలక్ష్మీ ప్రెస్ వారికిని మా అభివందనములు.

మేము తలపెట్టిన ఈ ప్రచురణ కార్యక్రమమున ఆర్థికముగాను హార్దికముగాను సహకరించి ప్రోత్సహింపవలసినదిగా సహృదయలోకమును ప్రార్థించుచున్నాము.

దాసు పద్మనాభరావు
అధ్యక్షుడు
మహాకవి దాసు శ్రీరాములు
స్మారక సమితి

విజయవాడ
29-7-1974

# PREFACE

I wrote this book ten years ago when I was at Masulipatam at the instance of a friend of mine. In the course of a tete-a-tete he questioned me, if I could write a small Prose Work in Telugu fitted for a University Examination, containing a novel plot of my own, in the short space of a single week. Although, as a pleader, I had hardly any time to devote to any such work, I was able to satisfy my friend by placing before him within the specified time, this little book faircopied by myself. A work, be it however small, written in such a hot hurry cannot be altogether free from short-comings. For this I beseech the indulgence of my critics.

Ellore,<br>
Sep. 1893

D. Sreeramulu.

# పీఠిక



ఈ గ్రంథమును నేను మచిలీబందరులో నున్నపుడు స్వభాను సంవత్సరమున వ్రాసితిని. ఒకనాఁడు నా మిత్రులొకరు నాతోడ విలాసముగా నుద్ఘాటించుచు "యూనివర్సిటీ పరీక్షలకు పనికి వచ్చునట్లుగా నీ పరకెవ్వఁడును లేని యొక కథను కల్పించి తెలుఁగు భాషలో నొక గద్య ప్రబంధమును నొక్కవారము దినములలో వ్రాయఁగలరా?" యని ప్రశ్న చేసిరి. ప్లీడరుపనిలో నుండుటచే నిట్టి కార్యమును బూనుకొనుట కించుకైన వ్యవధి లేకుండినను, వారు కోరిన ప్రకారమున వారము దినములలో నీగ్రంథమును బూర్తిచేసి నా చేతితోనే శుద్ధప్రతి యొకటి గూడ వ్రాసి నా మిత్రునకిచ్చి సంతోషపెట్టితిని. ఎంత చిన్న గ్రంథమైనను ముందు వెనుకఁ జూచుకొనకుండ నింత త్వరితముగా వ్రాసినపుడు నిర్దుష్టముగా నుండుట కష్టము. కావున గుణగ్రహణ పారీణులెల్లరును దోషములున్న మన్నింపఁ బ్రార్థించుచున్నాఁడ.

ఏలూరు
సెప్టెంబరు 1893.

దాసు శ్రీరాములు

శ్రీరస్తు

# అభినవ గద్య ప్రబంధము

## స్తుత్యాదికము

శా॥ శ్రీ యాత్మీయముఖంబుఁ గౌస్తుభమణిన్ బింబితంబైనఁ బ్రా
లేయాంశుభ్రమ నగ్రజన్మ యని పాలిం జీర నిచ్చల్ మన
స్థాయిం దుప్రతిభాషణంబులఁ దదుత్సాహంబుఁ గల్పించు ల
క్ష్మీయుక్తుండు దాసు కన్నయ సుధీ చింతామణిం బ్రోవుతన్॥

ఉ॥ నిబ్బరమైన వాచవులనిండిన తొల్లిటి పొత్తకాంధ్ర మేల్
కబ్బపుఁ జున్ను జిహ్వకును గమ్మదనమ్ముల గుమ్మరింపగాఁ
జుబ్బనజుట్టి దాని నడి సోకులఁ దియ్యదనం బొకింత యిం
దబ్బునటుండఁ గూర్చితి నయంబుగ గద్దెపుసుద్ది యొద్దికన్॥

ఉ. నన్నయఁ దిక్కనఁ బ్రగడనాథు నధర్వణుఁ బెద్ద తిమ్మ సూ
రన్నల సోమ భాస్కరుల రాముని లింగనిఁ బోతరాజు భీ
మన్నను వీరనార్యుఁ గవి మల్లన లక్ష్మణుఁ గొల్చి కృష్ణ భూ
పున్నవమూర్తి రామకవి భూషణుఁ జిన్నయఁ బ్రీతి మెచ్చెదన్॥

కం. ధరణిని లేనిది యెపు డె
వ్వరివలనను వినని దఖిల వర్ణనముల సుం
దర మగు చరితము గద్యము
న రచించెద నేడునాళ్ల నలుబది పుటలన్॥

కం. అభినవ గద్యంబని లస
దభిధానము గాంచి మించి యాచంద్రార్క
ప్రభమై ప్రస్తుత పండిత
సభమై యిది వెలయుఁగాత సమధిక శుభమై॥

గీ. కల్లకతలు వన్ని కబ్బ మొక్కటి గట్టె
నొల్లమనుచుఁ దప్పు లున్న వనుచుఁ
జెల్లియున్న వారు చేరి నవ్విన నొప్పు
పిల్లవాని పట్ల పెద్దలట్ల॥

చ. సలిపితిఁ జిత్రవృత్తముల సంఖ్యము లైదు ప్రబంధముల్ రసా
కలితము లంతటన్ దొరలకట్టడి దట్టపువేడ్కఁ జాతి భా

సల జయపట్టముల్ కయివసం బొనరింపఁ దలంచి
కొన్నిటన్
గెలిచితి నిప్డు దూరగత గీష్మ్తతి మోముసకున్
మఱల్చెదన్॥

శా. సర్వజ్ఞత్వము సాంబమూర్తిది మనుష్య ప్రజ్ఞ
యల్పంబు దు
ర్గర్వంబుల్ కొఱగావు దూషణాల మోక్ష శ్రీలు
సేకూర వీ
యుర్విన్ ఖానికుఁ డెన్ని త్రాళ్లు వడపోయున్ వజ్ర
మొక్కంటికై
గుర్వర్థం బొకఁడున్న చాలదె సుధీకుంభుల్
పరీక్షింపఁగన్॥

కం. మచిలీ బందరు పుర లస
దచల నిజాంపేట నుండు నల దాసుకుల
ప్రచురుఁడు శ్రీ రాముఁడు గృతి
రచియించె స్వభాను రాధ రాక శశి నిశిన్॥



# అభినవ గద్య ప్రబంధము

## కథా ప్రారంభము

---

శ్రీమన్మహాపురుష మాయావిడంబితంబులై పరస్పరాకర్షణ ప్రభావ నియత స్వస్థాన ప్రవర్తనైక క్షమంబులైన యనంతకోటి బ్రహ్మాండంబుల నొకదాని యందు నీ భూమండలంబున బహు ప్రజా ప్రకాండంబైన భరతఖండంబునందుఁ గరువలి దెసఁ బసఁ బాఱు నెలపాలు పేరిటి యేటి తోటి మేటి యైన పాంచాలదేశంబున నింద్రావతి యను నొక పురంబు గలదు. అది మంచుకొండకుఁ గొంచె మించుమించు దక్షిణాముగా నుండు. దాని వైవస్వత మన్వంతరంబునం గల కృతయుగంబున నుమాపతి ముదల మయుండు నిర్మించె. అందిఱువది యెన్మిదవ మహాయుగంబున ద్వాపరంబునాదిఁ గందులేని తొవవిందుంబోలె విశదంబైన యశంబుఁ గలిగి మహోగ్ర మహాగ్ని శలభితారాతి సంఘాతుండై యార్తజన సంతోషణ పరాయణతఁ దనదగా నేర్చిన సుప్పాణి ముత్యంబులవలె విలువఁగను మేలు గొనంబులకు నాటపట్టునా వన్నెకెక్కుచు కరి గిరి కిరి ఫణి కమఠంబుల తలబరువుఁ దీర్పనో యనఁ దన బాహువున ధరాభారంబు వహించిన పద్మపాదుండను రాజకుంజరుండు ప్రజాపాలనంబు సేయుచుండె.

అతని యౌదార్య గాంభీర్య సౌకుమార్యాది శుభ లక్షణంబులు పరికించి యుగ్గడింప నలువకైన నలవిగాదు.

సురాభియోగంబున నింద్రుండును, అవినయంబున నగ్నియు, దక్షిణాశావిశేషంబున యముండును, రాక్షస కృత్యంబుల నిర్ఋతియు, అప్పులపాలగుట వరుణుండును, రూపంబు లేమి ననిలుండును, స్త్రీలోలయంబునఁ గుబేరుండును, ఉగ్రత్వంబునఁ బశుపతియు గర్హితులైరి కాని లేని యెడ నా భూపాలుఁ బోలుదురేమో! అట్టి మహాధన్యుండైన రాజన్యునకుఁ గాంతిమతియుఁ గలవాణియు నను నిర్వురు భార్యలుగలరు. ఆ ముద్దరాండ్ర ముద్దుమొగంబులు పున్నమనాటి నిండుచందురులే కాకున్నఁ దిలకచ్ఛలంబునఁ గలంకంబులును జిఱునగవు నెపంబున వెన్నెలయు నధరంబుపేర నమృతంబును జూపట్టఁ గతంబేమి? ఇరులో, మధుకరులో, జలధరులో యాతలోదరుల కురుల నెన్న నే కవివరుల తరము? ఆ యన్నుమిన్నల కన్నులు చేరెడేసి, చెవికవల మ్రోల నవ సంఖ్యలేమి లెక్క? అకొమ్మల గళమ్ములకు సమమ్ములుగాఁ జూచు దరమ్ములకు దరమ్ములు పోఁకక తిరమ్ముగ నిలువఁ దరమ్ముగాదు. బంగరు బొంగరాల పోలిక లా వాలుగంటుల పాలిండ్లకా? చాలు చాలు, సాబాలు పోలునో పోలక తూలునో? ఎటులైన నమ్మానినుల కానరాని కౌనులు పేదఱికాన ముప్పిరి లోఁబడెనో. ఆ మహోరుసౌందర్యములు రంభకు మృగ్యంబులు. వారిరువురు పాలు నీరుం బోలెఁ గలసి మెలసి యేయెడఁ గొనరత్రైనఁ గలతలేక పొలంతులై మాన్యుఁ బూనిన దారరబుతీఱఁ దిరుపొందుఁ జెందు నతి

యానతికి గడిదాటక యుపచరింపుచుఁ గార్యంబుల మంత్రుల లాగు, నుపచారంబుల నూడిగంపు పూఁబోఁడులలీల, భుజింపఁ జేయు తఱిఁ దల్లికంటెఁ బెక్కుమడుంగు లెక్కుడై, యదంభ పరీరంభ సంభావనంబుల రంభను గేలిసేయుచు ధర్మానుకూల వర్తనలకుం బ్రధానదేవత లన నోర్పునేర్పు నం బుడమిఁ దెగడి పొగడ్తఁ గాంచిరి. అట్లుండ పడంగాంచితుం డైన కాలపురుషు నుత్తమాంగంబునుంబోని యొకవసం తంబున వనంతాదేవి తన యినుతో వసంతంబులాడెనో యనఁ గింశుకంబులు పూచెఁ బ్రొమ్మావులుఁ గెంజిగురు జొంపంబుల నలంకృతంబులయ్యె, నదియేమి చిత్రమో ప్రాణులకు లోకబంధుండు గంటకుండయ్యె, నుగ్రశిఖామణి ప్రియుండయ్యె, నిష్కుటాభ్యంతరంబులు కోకిలాకాకలీకేకి లీలాకంబులయ్యె. అపుడు నృపుఁడు వనకేళీ వినోదాయత్త చిత్తంబుతోఁ దనముద్దులాడుల యొద్దకుం జని యిట్లనియె. పూఁబోఁడులారా! మన ముపవనంబునకుం బోయి మెల్లఁగా మల్లెపూచప్పరంబులకు గొజ్జఁగినీటియేటిదారిఁ జల్లనై బయల నందమ్మగాఁ గ్రమ్ము పూదుమారమ్ముల కమ్మ తావులు గ్రుమ్మరించు తెమ్మెరల హాయిఁ దెల్పు వనకేళి సేయఁగుతుకంబు వొడమెడిని; రండు పోదము.” నావుడు వల్లె యని యయ్యె అవురుఁగై దండలిచ్చిరాఁ గాలినడం దోటసొచ్చి యయ్యంభోజనయనల మృదుమధురసంభాషణంబులఁ దని యింపుచుఁ గోరులవిరులు దునుముచుఁ బాదంబులు బోదియుల నిడుచు దోహదవిశేషంబుల ననోకహరాజిరాజిల్లఁ జేయుచుఁ గమ్మని వలిగాడ్పు కూనలకు మేనిచ్చుచు నెన్నరాని వన్నె యులఁ జెన్నలరుఁ గ్రొన్నవలఁ గన్నులంజూచుచు శుకపిక

శారికానముదయంబుల కలకలంబులును, భసలవిసర ఝంకా రంబులును జెఱ్ఱుల పండువులునేయు వాలుగొమ్మలం ద్రాలు ఫలంబులందికొని కోసి మెసవుచు నొప్పెడు పుష్పాది గంధ వాడి నానాపుటగతంబైన నానందించుచుఁ గుంద మందార చందన విచుమంద సాల రసాల సురసాల నారికేళ నాగ పున్నాగ పూగ జంబు జంబీర కదంబ ప్రముఖ వివిధ విటపి వితానంబులం గలయఁ గ్రుమ్మరి ద్రాక్షాలతాకాయ మానంబుల నిలిచి నిలిచి యేలాప్రతతి డోలావితతిం దూగి తూగి చేమంతితీవెబోదియలఁ గడచి కడచి విహరించుతఱి నక్కుటిలకుంతలలం దిలకించి యులావల్లభుం డిట్లనియె. "చపలాక్షులారా, యుపరిరతి నాడుచున్న యీ యలరు గొమ్మఁ గాంచితిరే! భ్రమరకంబులు తూగి యాడుచున్న యవి పత్రములు సెదరుచున్నయవి. చను మొగ్గ లుబుకు చున్నయవి." అనిన నొక్కింత నవ్వి తల వాంచి కాంతిమతి యూఱకున్నఁ గలవాణి యిట్లనియె. "ప్రాణనాథా, యీలత కూన కిట్టి దిట్టతనంబు ప్రియకసంయోగసంపత్తివలనఁ గలిఁగి నదే. ఈ పున్నాగంబుఁ గంటిరే? పుష్పిణియై జలకమాడి తులలేని వలపునంగులుకు నీ మహిళ లోఁగొన సులలిత పల్లవ గుణంబు సూపుచున్నయది." నావుడు నరేంద్రుఁడు మంద హాసము నేసి "సుందరీ, పురుషసంస్పర్శసుఖాభిరతి నున్న దాని మన్నింపఁబూనుట తప్పుగాదు. అదిగో ప్రసవసమయం బగుటచే నడుమును బ్రక్కలును గొమ్మలు పట్టుకొన నిలువ లేక వెల్లంబోయి యున్నయది. ఈ మల్లియం జూడు"మనినఁ గలవాణి వింతగాఁ గన్నులల్లార్చి "ఈ మేలంబులకేమి, యీ

రంభం జూచితిరా? దరినున్న సరసు సంతానవృద్ధి సంతసింపఁ జేయుచున్నయది." అనుమాట విని నిజానపత్య భావంబు నకుఁ గడు వగచుచున్నంత నొక్కెడ మల్లికావల్లికామతల్లి కావేల్లితసల్లలిత ప్రదేశంబునం బూచప్పరంబు క్రింద నెల తాతి తిన్నెపైఁ గూర్చుండి యమ్మువ్వురు నిష్టాలాపంబులఁ బ్రొద్దుపుచ్చు సమయంబున.

ఆ చెంగట నొక దేవవల్లభమహీరుహంబు గలదు. దాని కోటరంబు గూడుచేసికొని చిరకాలంబునుండి యొక శకుంతమిథునం బావాసంబు సేయుచుండు. పురుషనీడజంబు నకుఁ గాలజ్ఞుండని పేరు; స్త్రీ విహంగంబు దివ్యదృష్టినాఁ బరఁగు. ఆ దివ్యదృష్టి యంగనాద్వయసనాథు జననాథుఁ దిలకించి మనుష్యభాషణంబులఁ దన మగని కిట్టులనియె. "ఓ ప్రాణనాయకా, చూచితే ఈ సార్వభౌముండు సకల సౌభాగ్యసంపన్నుండయ్యు నొక్కఁట దైవోపహతుండయ్యె; నది యపత్యరాహిత్యంబు. సద్గతికిం బ్రథమ సాధనంబు సంతానంబకాదె? నీవు సర్వజ్ఞుఁడవు. ముజ్జగంబుల నీకుఁ దెలి యని యర్థం బించుకయులేదు. నీ చెప్పినచొప్పునఁ దప్పక యాచరించి మర్త్యమలోకవాసులగు భూపాలురనేకులు బహు శుభంబులం బడసిరి. నీ పలుకులు రామబాణంబులు. పరోప కారంబు సాధువులకు సహజగుణంబు. కావున నీ రాజముఖుల యందీ ధరాజానికపత్యప్రాప్తి యెట్లగునో తెలంగొద్దేని నెఱింగింపవే" యనుఁడు మందహాసాలంకృతవదనారవిందుండై కాలజ్ఞుండా విహంగాంగనతోడఁ "గలికీ, నీ పలుకులు నిక్కంబులు. లోకంబున నుత్తముఁడగు దేహధారి యప్రార్థితుండై పరులకు మేలుసేయంబూను. నేడు మనమట్టి

పుణ్యమునకుఁ బాత్రులముగాము. అది యేమనిన నీ రాజు వలన డాగికాదె యీ వాసభోజనంబుల కిసుమంతయుఁ గొఱత లేక చిరకాలంబునుండి మనము బ్రతుకుచుంటిమి. ఎవ్వని యేలుబడిఁ బ్రాణికోటి సుఖించుచుండు లగు, వానికి వాని కార్యం బవశ్య విధేయంబుగాని యదియొక మహోపకారంబు గాదు. చిక్రోడసిక తాలేశన్యాయంబుగా నీరాజశేఖరునకు నేఁ జేయుపని కొంచెమైన నదినాకు శ్రేయస్సాధనంబేయగు. పిడి కెండడుకు లుపాయనం బిచ్చిన కుచేలుఁ గృష్ణుండెంత చేసె నెఱుంగవే ? కాన నాకుందోచినట్లు చెప్పెద వినుము". అని యింతవట్టు జరిగిన సంభాషణంబులు చెవులఁ దగిలి వెఱఁగు పాటున నిక్కంబుగా మానిసి పలుకులుఁగాఁ దలంచి యమ్మ వ్వాఱు నొండొరుల మొగంబులు సూచుకొనుచు నలుదిక్కుల నారసిన నెందును మనుష్య సంచారంబు గానరామియుఁ బ్రకృత ప్రసంగంబు నిజశుభానుషంగంబగుటయుఁ గొంతవడి ఱిచ్చవడి యూచి తలయూచి యెగఁ దిగఁ జూచి యారాచ సింగంబు పూచి కాచి యేచియున్న యా చెట్టుపై దృష్టివైచి నం బతఁగద్వితయంబు గన్నులంబడిన "నారా, తెలిసికొంటి నివేకదా యింత దనుక మన ప్రశంసంబు సేయుచున్న"వని తన మెఱింగినది కుఱంగట నున్న కురంగనయనల కెఱిం గింతుఁగాక యని పెదవిఁ గదల్పక చేసన్న సేయ నది సూచి పలుకుమాని పులుఁగుదోయి తోఱడు సాచ్చె. అంత న య్యసంతాకాంతుండు సంతసంబువలనఁ దొఱంగి యత్యంత చింతాక్రాంతుండై కాంతలం గాంచి "కటకటా! మోస పోతి మి కేమిసేతము? ఉన్నట్లయుండి యింకంగొన్ని మాటలు వినమైతిమి. పట్టఁజాలక యేలఁబరికింపఁ బూనితిమి? పూనితి

మఱో, యేసేల నీ పున్నాగభూరుహంబు డాపుసేరితి ? చేరిన వాఁడ మిన్నకుండక మిమ్ముఁ రా సన్న సేయనేటికి ? మంచికిం బోయిన బొమ్మనునట్లు కొంచెముసేపు కాచియున్న నేమేమి చెందుమో? బుద్ధిః కర్మానుసారిణీ యను విద్వద్వాక్యంబు దబ్బర యగునే? నుడి యుడుఁగినఁ బోనిమ్ము. చక్కని చెక్కులుగల యాపక్కికవనైనఁ జూడ నోయనైతి: ఊదుపొట్టలు నమలువాని కూఁచ బియ్యము లెక్కడివి?" అని యిట్లు పలుతెఱంగులఁ దలపోయు ప్రాణసఖుం గాంచి కాంతిమతి యిట్లనియె. "నరేంద్రచంద్రా! యిట్లేల చింతించెదు? ఖగజాతికి మనుష్యభాషణంబు లశ్రుతపూర్వంబులు. ఇప్పట్టునం బిట్టల కిట్టి దిట్టతనంబుగలదని తెలిసిన మనకు నెమక నిమిత్తంబులేదు. దొంగవాకిట మంచంబు వైతుము. రద్దికి సుద్ది యుడుగునో యను బుద్ధి మనకేల వాదము? అహేతుకంబుగాన నది యనుమేయంబుగాదు. ఏతాదృశవృత్తాంతప్రస్తావంబునకు మహత్కృత కోశప్రాగ భారంబునం జేసి శబ్దవేద్యంబునుం గాదు. ఇష్టాలాపశ్రవణ కుతూహలులమైన మనము వక్త్రదర్శన మభిలషించుట దోషంబుగాదు. పొన్నమీద పిట్టలను మన మన్నదేమున్నది? ఆ వంగనాచి తెక్కుదారులకు వీపున నీఁగ వ్రాలలేదే? వానికి మనమేమి కీడు దలంచితిమి? మన యనపత్యంబునకు జాలింజెంది మేలుసేయ నమకట్టి మొట్టమొదట పట్టిపిట్ట కతలాడి తుట్టతుద మొట్టుపట్టున నట్టుసేసినట్టు దూరపట్టి కట్టి కొట్టి తిట్టి వాకట్టుఁ గట్టితిమా యేమి ? చెప్పదలంచినది కడతేర్చి మాగొబ్బాలితనంబులఁ గడకొత్తినఁ దమ్ము దాచగద్దియం బెట్టి తమ వంపు సేయుచుందుమే! కావున

ఘనయందుఁ గళంకంబేమియున్నది? గత జలసేతు బంధంబులు వేయేల ?" అనుండుఁగలవాణి యిట్లనియె. "అక్కా! యీ చక్కటు లెంతచక్కగా నున్నవమ్మా! పక్కల వక్కాణంబులు బహుపురాణగోచరంబులుగావె? ఇవి తాదృశపురాణక్షేచరంబు లని యేల యనుమానించరాదు? మనపాలింటఁ బార్వతీపరమేశ్వరులుగా వచ్చి మేలు సమకూర్ప గమకించు విహంగంబులయందుం గూడమి వెట్టుట ముద్దుబెట్టినవాని మూతి గఱచిన చందంబు, బాగుగా నాలోచింపక యే మాటగాని యనరాదు. వేగిరపడినఁ గార్యాలోచనంబు పొసంగునే? ఆ తెక్కదారు లేకతంబున నేకతంబునఁ దొఱఁడుసొచ్చెనో? మనలోపంబున నొండె, వాని నియమంబున నొండెఁ గాఁబోలు. పిలిచి పీట వైచి కాదు కూడదు మాకు మతిగతులు దెలుపుఁడంటిమా స్వతోజాతదయాసముద్రంబున జిన్నియల చిన్నియల పొడసూపె; మనల నాలోకించి తూష్ణీంభావంబు నొందుటకుఁ గారణంబేదే నొకండుండు. అది యుల్లంబులకుఁ జొరకట్టక యూరాటపడుట రిత్తపని. త్రాఁడులేని దబ్బనపుకుట్లకు గంత లతుకునా? నేటి కింటికింబోయి మన యమాత్య విద్వజ్జనంబుల కీ వృత్తాంతంబు నివేదించి రేపు మఱల వచ్చి చూతముగాక" యనిన నంత దినాంతంబగుడు వరుణదిశ యరుణకాంతిపుంజంబుల రంజిల్లెఁ జకోరంబులు కేరిమీరెఁ గోకంబులు పురపురంబొక్కెఁ దమ్ములు మొగిడ్చెఁ గలువలు వికసించెఁ బ్రాగంగనాముఖన్యస్త సిందూరతిలకంబన్నఁ గుముదబాంధవుండు తూర్పుకొండపై నుదయించె. నింగిం జుక్కలు పిక్కటిల్లె, రతిరాజు ధనుర్ధరుండయ్యె.

అపుడు విపులాధీశుండు తన యనుంగువెలఁదులంగూడి నిజసౌధచంద్రశాలాభ్యంతరంబు సేరి యేమియుం దోఁచక వారలతో నారాత్రి వేగించి మఱునాడు వఱువాత లేచి ప్రాతఃకృత్యంబులు నిర్వర్తించి యాత్మీయ సభామండపాభ్యంతరమున నవరత్నశోభితంబై యసమసుషమాభిరామంబైన సింహాసనంబున నాసీనుండై యంతకుమున్న వచ్చి జోహారులుచేసి నిలిచియున్న మంత్రివర్గంబును విబుధబృందంబును నాలోకించి శుంభదంభోధరాదంభగంభీర భాషణంబుల గతదినవృత్తాంతంబు సవిశేషంబుగా వారలకెఱింగించిన నందఱు విని యూఱకున్న మతిమంతుఁడను నొకమంత్రికుమారుఁడుఁ గించిన్మీలితనయనుఁడై మదిఁ బరికించి సవినయంబుగాఁ బుడమిఱేనివంకఁజూచి యిట్లని వచించె. "ఓ పరిపంథి గంధగజకంఠీరవా! కాంతిమతీ కలవాణీప్రాణధనా! క్షత్రియకులకుముదబాంధవా! యేనొక్క చిన్నవిన్నపము జేసికొనియెద నవధారుము. నిన్నటి పగలింట దేవర యాపౌన్నమీఁదఁ గన్న వన్నెఫులుగులు గిన్నెరపక్షులు; అవి నానావిధ భాషాభేదంబులెఱిఁగి పలుకనేర్చు. అవిమీఁకుఁ గడుంగూర్చునవియై యుండ నేలినవారు చేసన్నంజేసి భీరువులఁ జేరఁజీఱిన విముఖంబులై కోటరంబు సొచ్చె. అది యేమనిన నియమనిష్ఠాగరిష్ఠులైన సత్పథచారులు వంధ్యాముఖదర్శనంబు గర్హితంబుగా నెంతురు. మహాప్రభూ, నేడొంటరినేగ సర్వంబును శుభకరంబయ్యెడు" నని విని యందఱును మతిమంతుబుద్ధివైశాల్యంబుఁ గొనియాడిరి. రాజును సంతోషభరితాంతరంగుఁడై మతిమంతు బహూకరించి అచ్చ

బాలించి శుద్ధాంతనిశాంతంబుఁ బ్రవేశించి కాంతలకిది యంతయుం దెలిపి యానాడును ముహూర్తద్వయ మాత్రంబు ప్రొద్దుగలుఁగం దోటసొచ్చి తొంటియట్ల శశి కాంతకుట్టిమంబునం గూర్చున్న సమయంబున దివ్యదృష్టి తనభర్త కిట్లనియె. "ఓ జీవితేశ్వరా, ఈ భూభుజుండు తన ధర్మపత్నులం దిగనాడి నేడొక్కరుండ యిక్కడికివచ్చె. నిన్న నాసన్నుతాంగులు గదియరా మనమూఱకున్న కతం బుననని తోఁచుచున్నయది. నా మనవి యాలించి నేఁడైన నీ పుడమిఱేనికి హితోపదేశంబు సేయవే" యనిన, "ఓలలనా లలామా, ఈక్షితిపతి కుపదేశింప నిది సమయముకాదు. ఈ జనపాలశార్దూలుండు మన యొచ్చెమంతయు అచ్చఁ బెట్టి యింతఁదెచ్చె. ఇతని నాలుక నూవుగింజ నానదు. ఇట్టి గోప్యంబులు బట్టబయలు సేతురా? ఏ నిపుడొక క్రొత్త బుద్ధిచేఁ జెప్పవాఁడఁగాను. ఇదె చూడుమని మెడఁద్రిప్పిన దివ్యదృష్టియు నట్లు చూచి యిఱువురు మఱల గోటరంబున మఱగిరి. అంత నానేలయేలిక యచట నేమి వింతయని యాదిక్కు చూడ నెవ్వఁడో యొక్కరుండుఁ దరువుమండాం తర్ధి నుండి యప్పుడ పలుకువిడుచుండె. ఆ సందెజామున వాని గురుతింపనేరక యయ్యవనీధవుండు తనలోఁ దా నిట్లు వితర్కించె. "అయ్యయో, శ్రేయాంసి బహువిఘ్నాని యను నార్యోక్తి కిదియ యుదాహరణంబయ్యె. కాలికిఁ బెట్టిన వ్రేలికివచ్చుచున్నయది. సభాంతరంబునఁ బ్రకటింపకున్న మతిమంతు నాలోచనంబు నాకెట్లు పొసగు? అది లేని యెడ నేనొంటివచ్చుటెట్లు? ఈ కాచియున్నవాఁడెవఁడో. నావంటి యపుత్రకుఁడేయని తోఁచుచున్నయది. ఇది యెవ్వరికిం

దెలియరాకుండ నీ వొంగరాక యేనెట్లున్నారింతు ? వీఁడు నే నెఱింగినవాఁడుఁ గానట్లున్నవాఁడు. ఒకవేళ రేపువచ్చి వినఁ దలంచినను ముచ్చురాకుండు టెట్లు?" అని తలపంకించి "కాని దీనికొక యుపాయంబు సేతు. లాఁతులేరును నేటినుండి యీ తోటకు వాసరత్రయమాత్రంబు రాకుండునట్లు కట్టుచేసి సాటింపుసేయింతుఁగాక" యని నిశ్చయించి నిజమందిరము నకుం జని యా రేయియంతయు డోలాయమాన మానసంబుతో నాఁకలికూర్కు లుడిఁగి యేదియుందోఁచక మృదుశయ్యం బవ్వళించి మాటాడక పిశాచంబు సోకినవానివలె నున్న ప్రియుంగాంచి కాంతిమతీకలవాణులు చేరవచ్చి యిరువురుఁ జెఱియొకపదంబు పట్టి యొత్తుచున్నతఱిఁ గలవాణితోఁ గాంతిమతి యిట్లనియె. "చెలియరో, మన ప్రాణనాథుండు నిన్నటి రేయినుండి నిదురసాలించి యా కట్టడి పిట్టలమాటలంబట్టి యిట్టులుంట నీవునుం జూచుచుంటివి. వినోదకథాకథనంబు నకు నీవు ప్రథమగణ్యవు. ఒక కథ సెప్పి సుఖస్వాపంబు గలుఁగఁజేయుము. నావుడు నా యుడురాజవదన వల్లెయని యొక కత నిట్లు సెప్పందొడంగె.

తొల్లి కపిలదేశంబునఁ గబళాపురంబునఁ బ్రభాకరుం డను బ్రాహ్మణుండు గలఁడు. ఆయన భార్యపేరు కనకవల్లి. ఆ పాఱుండు నిగమాగమవేదియు నీతికోవిదుండును సంగీతసాహిత్యకలాపారంగతుండును నై యంగ వంగ కళింగ కాశ్మీర కుంకణ కొంకణ ద్రవిడ కర్ణాటాది దేశపాలకుల సభాంతరంబుల నిజవిద్యామహత్త్వంబు కలిమిఁ జేరువడసి యనేకాగ్రహారంబులుం బడసి యేయెడఁ గొదువలేక సకలసంపద లనుభవింపుచుఁ దోరమ్ముగఁ గాఢానురాగం బెనుపఁ దనకుమారాత్మ

నవహాయన వయస్కుఁ గ్రీడాయత్తచేతస్కు విద్యానాథా
భిధానుఁ గదియఁజీఱి యంకంబున నిడికొని చుబుకంబు పుణికి
శిరంబు మూర్కొని "నాయనా, నీ యనవద్యవిద్యాకౌశలంబు
నే నెన్నఁడు జూతు ? నరునకుఁ జదువే రూపంబు. పరదే
శంబునం బ్రాణబంధువు. అదిలేనివాఁడు చతుష్పాత్ప్రా
యుఁడు. నీకుం దొమ్మిదేండ్లు గడచె; నేటికిని యాటలు
మానవైతివని బుజ్జగించి యొజ్జలయొద్దకుం బనిచి యను
దినంబు నలవఱచి బహుదివంబు లెంతకఱపినం బాలరామా
యణంబె తుదముట్టదయ్యె; ఒకనాడుద్గులంగూడి రద్దిసేయుచు
వాకిటఁ గూఁకటులు వట్టికొని ఢొమ్మన దుమ్ముగ్రమ్మ
దొఱలాడుచుఁ గుట్టాలములఁ బెట్టలజడిఁబడు బుడుతంగాంచి
కోపోద్దీపితంబులై కణకణలాడు చింతకొఱవులంబోలె నరు
ణంబులైన నయనంబులతో మొటమొటమనఁ బండ్లు పటపటఁ
గొఱికి, "ఓరి కులపాంసనా, కడుపు చెడఁబుట్టితివి, నీవు నాకు
శత్రుండవుగాని పుత్రుండవుకావు. నీవలన నాకపయశంబే
కాని లేశంబైన సుఖంబులేదు. నీవు జన్మింపకయున్నఁ
గొంత మేలుగానుండు"నని గద్దించి వేత్రంబుగొని చరమ
గాత్రంబున నైదారు దెబ్బలు బొబ్బలుదేఱఁ గొట్టినఁ
దప్పించుకొని యొండేచని యారాత్రి యాపుటభేదనంబున
కనతిదూరంబుననున్న కాసారతీరంబుసేరి యందలి మధుర
జలంబు గ్రోలి యొక మఱ్ఱిక్రింద నిద్రించి మఱునాఁడుదయం
బునకుఁ బూర్వంబలేచి ప్రాఙ్మార్గంబుపట్టి సనిసని సింగంబులు
నేనుంగులు పులు వెలుంగులు చిఱుతలు కొరణాసులు సివం
గులు తేచులు దుప్పులు మనుబోతులు కాఱెనుములు ఖడ్గం

బులు గండకంబులు లోనుగాఁగల యాటవిక సత్త్వంబులకు విహారయోగ్యంబై నిర్మానుష్యంబైన మహాగహనంబు సౌర వారి యందుఁ గ్రిక్కిరిసి పిక్కటిల్లి యున్న పెనుమ్రానుల నీడఁ బోయిపోయి దీర్ఘపథశ్రాంతి డస్సి యుస్సురనుచు నాక టంబడి డప్పింబడలి యెందుఁజూఁచిన గోడికూఁతయు ఊఁకటి చప్పుడు శ్రుతిగోచరంబుగాక యేచోటుదిఱిగినఁ బరిసెడు జలంబులకు మొగంబువాచి జిహ్వదిరిగి సొమ్మసిల్లి మెదల మేనురాక కదలఁ గాలాడక యొక మహోన్నతతరుచ్ఛాయ భూతలంబునఁ బైపుట్టంబు పఱచి యుత్తమిల్లి కొండొకసేపు తనలోఁదాను "దైవమా! యీ యగ్గలంపు గోరంబున కగ్గలంబైతిని; లగ్గగులు దెలియక పడుచుదనంబునం బెద్దల పంపుసేయనివాని కిది వలవదే? ఈ కాఱడవి నే బెబ్బులికిఁ బొక్కుడగుదునో, కడిపెడు నీరైనఁ ద్రావి యుసుఱు నిలుపు కొనరాని కానిచోటుపట్టితి. ఈపాడుకాడు తూరుపిది పడ మఱయిది యని యేర్పరింప నలవిగాని చిమ్మచీకటుల కిమ్మగా నున్నయది. ఇది దారి యిది తెన్నని చెప్ప నాకిక్కడ నేరు దిక్కు?" అని విలపించుచున్నతఱి నా చెంతఁ గొంతదూర మునఁ జిణుకు చిణుకుమని యొక రవఱవళి దోఁచిన నాలించి దిగ్గునలేచి యవ్వలన ఱెప్పవేయక తప్పక సూచి చూచి యెంతకాచిన నయ్యులివతక్క వేఱొక్క విశేషంబు గాన్పిం పక విసికి సడ్డచేసి యట్టె కనుమూయ గుభులు గుభులుమను ధ్వని వినవచ్చి కనువిచ్చి యా విప్రకుమారుం "డీ యారణం బులకుఁ గారణంబు లేకుండదు. ఈతకు మిక్కిలి లోఁతును జావున కెక్కుడు గీడును లేదు. ఏది యెట్టులైనఁగానిమ్ము; నే నా చాయనరిగి యెఱిగివత్తుగాక" యని తెంపుజేసి

గుండెఁ గట్టిజేసికొని యుల్లనలేచి మెల్లఁగా నొక్కింతదవ్వుఁ జన ననేక చక్రవాక బలాహకా ప్రముఖసత్వోన్ముఖపతత్రి సంసేవితంబును, కమలకుముదకల్హారాది నానావిధసూనప్రవితాన విరాజమానంబును, పారోపలచారుస్థల సారామల భూరుట్కుల విలసితంబును, వినిర్మల మధురపానీయ పరిపుష్ట సకలజంతువారంబును, నగు నొక్క కాసారంబు పొడఁగని పేదకుఁ బెన్నిధి యబ్బినట్లుబ్బి యుబ్బరపడి గొబ్బున నాపెను డిగ్గియుం డిగ్గి కాలుసేతులు గడిగికొని బెట్టిదంపు నీరువట్టునం బడియున్నకతాన నాగిలంబు జలంబు గ్రోలి గట్టున నొక చెట్టుక్రింద నుపవిష్టుండై యా కమలాకరంబు కరంబు వినోదకరంబుగాఁ గన్పట్టిన నప్పాటుల కేనితూగ యాకొలను గలయం గనుంగొన.

అందుఁ గొందఱు మందయాన లందంబుగా జలక్రీడ లాడుచుండి రెట్లన. మొలబంటి నీళులనురడి పాథోవిహారంబు తోరంబుగాఁ జేయుచున్న యాడువారిలో నాడువారిలో నొక వారిజానన బారదూరమునుండి యోల యోల యని తన మీఁది కీదులాడుచు వచ్చుచున్న చకోరాక్షిం జూచి యో మఱదలా, నీ యీఁతల మ్రోఁత కేమి, యివి నాకు బ్రాఁతులు కావు. నే నిచ్చటఁ గృపీటంబుల మునింగెద. నీవు దిట్టవేని నా పట్టు దెలిసి పట్టుకొను"మనిన "వదినా, నీ పిఱికి తనంబు నా కెఱుకయయ్యెఁ బోరలేక పాఱిపోవుచు నా పఱుగంది కొనుమన్నట్లున్నది. నాతో నోలలాడలేక నీరు దూఁరఁబోవెదవు. నేఁడే నేను తలయంటికొని రవనూనె రాచి నవతించు కొన్న నా కీలుగంటు తడసిపోవు"నన "ఔనౌను. నీకుఁ బెచ్చు టలు మెచ్చఁదగియున్నవి. అవలేక మద్దెల యూఁతన్నట్లు

న్నది. ఏది నీవడిగలతనము చూతము రమ్మని కరమ్ముల నీరమ్ములు పూని మొగమ్మునం జిమ్మిన నుద్ధుకుడిచి "ఓయమ్మా, నీ పుణ్యము సాజోలికి రాకు"మని మఱియొక ముగుద మఱుఁగు జొచ్చిన నది "తాళు తాళు, ఈ పోలతుకఁ జిలుతకంజేసి పలుగు లెత్తెదు. నా తెఱవు వచ్చిన నీపరువు నిలుపను"అని బెదరించుచుఁ దోనతోన చానమేను నానవాన గుఱియింప "నోతల్లీ, చెంపలు వేసుకొంటి, నీ కాలికి, మ్రొక్కెద నూను"మని యుసురు దక్కించుకొని యింకొక తలిరుబోఁడివలన డాగిన నది జేఁగి "యోసన్నుతాంగీ, నిన్నమొన్నటి చిన్నకూన; దీనిమీఁదనా నీసాదనాలు! కాచుకొ"మ్మని రివ్వునఁ బార సాచి 'యొకయీదీది' దాని వేనలిఁ బట్టిన నది విదలింప నీలాలకజాలంబు మొగంబునఁ జుట్టుకొనిన దవుల దవులనున్న నవలాలు నవ్వుటాలకు మీఱి "యానా పూబోఁడులారా, పవలు చంద్రోపరాగంబు రాకరాక యీరాక రాఁగలిగెఁ జూచితిరే"యనుచుండ నొక చిల్కలకొల్కి జలంబులమునిఁగి పద్మబిసంబులు దునిమి చేకొని పైకెగయ నొకర్తు సూచి "ఇదియ సమయంబని యోషధీమూలంబులు సంగ్రహించి తివో" యనిన "నోకనకాంగీ; ద్విజసంఘంబులఁ దృప్తిఁబొందింప నిది వేళగదా! కావింపు"మనిన "యోచంద్రవదనా, యీ పద్మాకరంబంతయు ద్విజశిఖామణులకు ధారవోయుచున్నదాన"నని చేతుల జలంబు దోయిలించి విడిచె. అంత నొక నీలాలక "యీ మేలంబుల కేమిగాని కొమ్మా, నీ మొగంబునఁ గమ్మకస్తూరి తిలకమ్ము చిమ్ములాడిన జలమ్ములఁ గాఁబోలు కలయఁ గ్రమ్ముకొనియున్న"దన "నోయెమ్మెలాడీ, నీ ముఖముకురమ్ము సూపుము. దిద్దికొనియెద"నని కరమ్మున

పవరింపబోవ జుంజుమ్మని తుమ్మెదలు జేగిన "నోకోయమ్మా, ఈ మధుపమ్ముల మాదమ్ములేమయమ్మా," యని బెదరిపడి శిరమ్ము ద్రిప్పిన నవి కానరావయ్యె. అంత నా చెంతనున్న యొక యింతి "యిది యేమి వింతయమ్మా! నీ సిగ ద్రోక్కుకొని నీవే బెదరిపడియెదవు? ఇది యేటి వగలమ్మా! మానినీ, నీ చెవిలో మాటఁ జెప్పెద నిటు రమ్మని చేయిసాచినం బిస బుద్ధిం గరవల్లి వ్రాల నేతెంచు రాయంచం గాంచి యా చంచలాక్షులు పకాపకా నవ్వినవది గానరాదయ్యె.

ఇట్లు వివిధ వినోదవిభ్రాజమానలై చానలు జలకంబు లాడి తజికడలినుండి వెలువడు నచ్చరలంబోలెఁ దీరంబు సేరి పుట్టంబులుగట్టి భూషణంబులుదాల్చి యొకరి వెంట నొకరు తరుషండాంతరంబుల మఱిగి కానరారైరి. ఇదియం తయుం బ్రాహ్మణ కుమారుండు సూచుచుండఁ దుదకొక వంకం బంకజంబులబింకంబులు గ్రుంకఁజేతునని మృగాంక బింబ మకలంక నిరాతంకలీల నింగినుండివచ్చి మీనసరంబైన యానసరంబుసొచ్చి యనళీకనాళీకపాళీకల్పిత మృణాళనాళ శృంఖళులఁ గట్టంబడియెనో యనఁగ గక్షద్వయసంబగు కాం డంబులనుండి బాహుద్వయమ్ము సాచి కరాంగుళులఁ దమ్మి మొగ్గలు సిదుము మదవతీవదన మొకడింకను దృష్టిపథగం బగుచున్న నాకుంభినీసురడింభకుండు ప్రమింగ మెతుకు లేదు మీసాలకు సంపెంగనూనె యనినట్లు వలువ దులిపి వలెవాటు వైచికొని, జుట్టుగట్టి ముడివైచి, మదనప్రదరవిదళితహృద యుండై యాఁకలి మఱచి యా కలికిమిటారిసోయగంబుల దగిలి మిగులఁ దమకించుచున్న యావన్నెలాని చిన్నెలాకన్ని

యుయుఁ జూచి పోతుటేఁగకుఁ జొరరాని యీదుర్గమారణ్యంబునకీ కందర్పసుందరుండైన నరుం డొక్కరుం డెట్లు వచ్చెనోయని యచ్చెరుపడి యీ చక్కదనాలయిక్క సొకుం దక్కనేని చక్కెరవిలుకానికి నిక్కముగా నేనొక్క మ్రొక్కుఁ జెల్లింతునని, యందమ్ములైనఁ గెందమ్ములు కేలఁగీలించి తీరంబుసేరి చేలంబుగట్టి కంచెల సవరించి కురువిందమ్ములుచెక్కిన గజ్జెలు కడాని యొడ్డాణంబు విన్యాణంబుగాఁ గీలుకొలిపి చారుతరమణిహార వారాభిరామమైన పాలవెల్లి కడ భాసిల్లు మోహినీదేవతయన గంధగజమందగమనంబున వసుంధరాబృందారకనందనుని కట్టెదుట నిలచి మొగమున వ్రాలు ముంగురులు దక్షిణ కరాంగుళులఁ జెవులకై వత్తి, ముక్కుఁ జక్కఁ దిద్ది వామహస్తాంగుష్ఠతర్జనులు చుబుకంబున నొయ్యారంబుగాఁ దీర్చి, భామలోకయింత సోయగంబుగా నగజించి కన్నులల్లార్చి తలిరాకువాతెఱ మొలకనవ్వులయఁ దల యించుకఁ గదలించి యొక్కపఱి గ్రుక్కిళించి యా మొలకపాలిండ్లకులుకులాడి పయ్యెద సవరింపుచు తులలేని జంటితేనియలొలుక నిట్లనిపలికె. "ఓ జగన్మోహనాకారా, ఈనిర్మానుష్యంబైన కాఱడవిలోని యీ కొలను గనులఁజూచిన జనుం డిదివఱ కొక్కరుండును లేఁడు. నా చిత్తవిత్తంబు చిటికెలో హరించిన దొంగ వీ వెక్కడనుండి వచ్చితివి ? మచ్చెసిడెము, ఇంచువిల్లు, పూలగోలలు సమర్చినసీవు తియ్యవిలుకాఁడవే ! యాకటండన్ని నిదుర లేక కడుఁ దూలియున్న విధంబు దోఁచెడిని తెలుపవే" నావుడు నాపుడమివేల్పుటొడయుని బుడతండు గడునలరి తనయుదంతంబంతయుఁ దప్పకచెప్పి "యో యొప్పులకుప్పా, నీవుద్దు

మొగంబు దిలకించినది మొదలు మదనబాణాహతుండనై కదలలేక యుంటి"నన విని యా చిలుకలకొలికి "యోచిన్ని సామీ, నీకు నే మేలుసేతు. నీ కమలాకరంబున జలకంబులాడి యిటురమ్మ"నిన నతం డట్లుసేసె. రాజుఁజూచి "నీకొక భారతీ మంత్రంబుపదేశింతు నది యనుష్ఠింప సకల విద్యలు హృద్గతంబులగు"నని వచియించి యట్లచేసిన నతండు సకల విద్యాపారంగతుండై కోటిమన్మథాకారుండై యద్భుత శక్తిసంపూర్ణుండై యా కన్నియయెదుట నిలచి చదువు కలిమిఁ దెలివి వెలసి "ఓతల్లీ, కనకవల్లీ" యనినమాట విని యొక పద్మనాళంబు చేఁబూని తత్సుషిరంబున నేమో గుసగుసలాడి పాదంబు లంట నొక యూఁదూదిన, మైమఱచి పడియున్న వాని యుసురు నేర్పునఁ దివిచి యంతకమున్న యచటం జచ్చియున్న యొక రాచిలుక మేని లోనికిం జొనిపి యా బాడబశాబకకళేబరంబు సెడకుండ మఱల నభిమంత్రించి యొక వృక్షశాఖం దగిల్చి యా చిలుకను ముంజేత నిడుకొని యొక పుట్టదారిఁ నధోగమనంబుచేఁ బాతాళంబున భోగవతీపురంబున వినీల నీలస్తంభంబుల మేలిమి యోడుఁబిళ్లల మగరాతిగోడల గారుత్మతమణితోరణంబుల ముత్యాలముగ్గుల నతిరమ్యంబై చెన్నలరు సౌధాంతరంబున రతనాలపంజరాన నా రాచిలుక నునిచి తోడి చేడియలఁగూడి యాడుచుండె.

అంత నిక్కడ పద్మపాదజనపాలకునకు నిదురఁ దొలఁగ విసంగంచి శాంతిమతి "యో చెలియలా, యింతట విరమింపుము. కొదువ వినవలతు. రేపుమాపు వినిపింతువుగాక" యనిన నాయమ యట్లసేసె.

మఱునాఁ డుదయంబున మేల్కాంచి భూవల్లభుండు తన యాశయం బితరులకుం దెలియరాదని తన ప్రధానమంత్రి రావించి యోమంత్రిశేఖరా, నేడు మొదలు దినత్రయ మాత్రంబు తోఁటలోనికి నెవ్వరును బ్రవేశింపకయుండఁ జాటింపు సేయింపు”మనిన “మహాప్రసాదంబ”ని యతం డట్లు గావించె. అంత నానాటి మునుమాపున నింద్రావతీపురాధీశ్వరుం డెప్పటియట్ల తన వనమునందలి చందుఱాతిన్నె నధివసించె; నంతకమున్న కాలజ్ఞుండు తన ప్రాణవల్లభ దివ్యదృష్టికి రాచచాటింపు విన్పించి యిక మూఁడువాసరంబులదనుక మన మచ్చట నుండరాదని పల్కి పయనంబై పోయి యచటికి యోజనత్రయదూరంబున నొక్కచో నివసించియున్నవి. కాన పక్షులు వచ్చునో యని యా భూమండలాఖండలుండు కొండొకసేపారసి విసికి యింటికివచ్చి యొక భర్మహర్మ్యంబుననుండి కాంతిమతీకలవాణుల రావించి యిట్లనియె. “వనజనయనలారా, మనము సకల భోగంబులుగలిగి బిడ్డలులేని కొదువఁ బాపికొనలేమైతిమి. లోకరక్షణసేయు జగదీశ్వరుండు మనసేల యనుగ్రహింపఁడు ? మొన్నటికిన్నెరపక్షులే మోమేలుసేయునని నేటివఱకుం గాచితి. ఈనం గాచి నక్కలపాలు చేసి ననినట్లు చాటింపుచేయించి నే నా పక్షులనయినఁ జూడ నయితి. ఏదియుఁ దోఁచకున్నయది. నిన్నటికథ ముగించినం గొంతఁ బ్రొద్దుపోవు”ననఁ గాంతిమతి కనుసన్నఁ గలవాణి చెప్పఁ దొడఁగెను.

అంత నచటం గనకవల్లి యా రేయి ప్రొద్దుపోయినను నాకఁ దనవల్లభుఁడు రాకకు నిరీక్షించి యిప్పటికి నిశీథంబయ్యెఁ నడువాయె. వాలాయమును బిడ్డండు సాపడువేళ మించె

నేఁడేల రాఁడోకో యని నిజనాథునిదండకుం జని దండప్ర
ణామంబుచేసి "ప్రాణనాథా, కుఱ్ఱండు గుడువ రాఁడు.
ప్రొద్దున నొక ముద్ద చద్దిఁదిని చనియె"నన విని ప్రభాకరుండుఁ
దా దండించిన విధంబు సెప్పి వెండియు "నతం డెట్టుపోయె
నదియు నెఱుంగను, తేపువిచారింత"మని యాకె నూఱార్చి
మఱునాడు వీఁ డెల్లఁ బరికించి యెందును నందనుం గానక
యుల్లంబు దల్లడిల్ల డిల్లపోయి పెల్లంగలార్చి దేశాధీశునాజ్ఞ
నతిజవసత్త్వసంపన్నులయిన రాజభటులఁ గొందఱ నందంద
నెమకఁ బంచిన వారును నేర్పు మెఱయ నూళ్లును, బాళ్లును,
మెట్టలును బుట్టలును, సందులును గొందులును, దరువులును
చెఱువులును, బేటలును దోటలును, బావులును, రేవులును,
గోటలును బాటలును, గుళ్లు గోపురంబులు, మేడలు మిద్దెలు,
సాలలు సావిళ్లు, కొట్టంబులు కోవెలలు, వెదకి వెదకి యేజాడ
నబ్బాడబకుమారుం గానక కొందరు మఱలివచ్చి ప్రభాకరు
నకు విన్నవించిరి. ఒక నల్లురుమాత్ర మా చిన్నవాఁడు పనిన
మార్గంబున నడుఁగుజాడపట్టి పోవంబోవ నమ్మహారణ్యంబు
సొచ్చి పదిలంబుగాఁ బోదపొద మఱలమఱల నరసి యరసి
యొక్క మాసంబునకు విప్రబాలకకళేబరంబున్న వృక్షంబు
దరి కఱిగి యా సారసాకరంబున నీరంబులాని తలలెత్తి
నూపిఱికల మానిసింబోలె వాతపోత వశంబున నుఱ్ఱూత
లూఁగుచు నొకకొమ్మ నిలువంబెట్టియున్న దృఢావయవంబై
జీవరసపరిపూర్ణంబై యొక్క చైతన్యవ్యక్తిమాత్రము దక్కి
యున్న శరీరంబు పొడకట్టిన నెట్టన నా నల్లురుం బట్టినడించి
నిజభుజాంతరంబులం బెట్టుకొని వచ్చి ప్రభాకరు కట్టెదుట

ననుపం బుత్రమోహాతిశయంబున నయ్యెడల నూపిఱికల
దకా యూహించి దృఢాలింగనసుఖంబునం బరవశుండై
యున్నతఱిఁ గనకవల్లియు నది విని యతిరయంబునఁ జను
దెంచి యాశరీరంబు పరికించి "యిదియేమి ? నాచిన్నియన్న
యిట్లున్నవాఁడు !" అని గతాసుగా నూహించి, "పదినెలలు
మోచి పలువేనటలపాలై యిన్నిదినములు నీవె మాకేడు
గడయని బహువిధంబుల బరిరక్షించుకొన్న నా కడుపు
పంటా ! నీ తండ్రి దండింప నాకేల చెప్పకపోతివి ? నా
తండ్రీ! యెచ్చటికి నేగి యాఁకటి కోర్వలేక కడునడలితివో;
ననుం దిట్టితివో; నేనేమిసేతు; నా కూనా! నీ మెత్తనిపలుకు
లేమాయె ? ఈ లీల మాతోడఁ బలుకక పడియున్న కార
ణంబేమి ? లేలెమ్ము నా ముద్దులన్నా ! యొక ముద్దు
బెట్టుము; నా వీనుల నీపలుకుతేనెసోనలేల నిండింపవు?" అని
విలపించుచున్నఁ, బ్రభాకరుండు కళేబరంబు సర్వాంగంబులు
పరీక్షించి "యయ్యయో, వీని సర్వేంద్రియంబులు చైతన్య
వ్యక్తి దక్కియున్నయవి. కుఱ్ఱఁడా, నీ కింత తెచ్చినది నేన
కదా"యని కన్నీరునించి తుఱటిల్లుచున్నఁ గనకవల్లియుఁ
దురంతచింతాభరంబున మునిఁగియున్నఁ గొంతవడికిఁ బ్రభా
కరుండు, "ఇతఁడు నిక్కవంబుగఁ బెద్దనిద్దురఁ బోయినవాఁడు
కాఁడు. కాయంబు కాసంతయుం జెడదు. దీనికి హేతు
వొక్కండు లేకపోదు. వైద్యవిద్యాధురంధరులచే బాగు
జేయింతు"నని యనేక విధంబులం దెలిపి యువిద నూఱార్చి
రాజభటులచే వారునని బాలుఁ గాంచినవిధం బంతయు
నెఱింగి యయ్యంగంబు నొక మెత్తని పాన్పుపైఁ బవ్వళింపఁ
జేసి భిషగ్వర్యులఁ బిల్పించి యనేక చికిత్సలుసేయించుచుండె.

అంత నచట భోగవతీపురంబున" అని యింత వట్టు కథ సెప్పిన విని కాంతిమతి "చెలియలా, యీ ధరాసురబాలునిఁ జిలుకంజేసి కొంపోయినది యెవ్వతె? యే కులంబు? పేరేమి? తెలియం జెప్పవే"యనిన, "అక్కా, యక్కన్య నాగలోక కన్యక; రత్నఫణుండను ఫణిభూషణుని తనూజాత; దాని పేరు మందారమాల; అది యెల్లెడ నా చిలుకను ముద్దు సేయుచు "ఓ చిలుకరాయఁడా, నాయెడ నేటి కయిన దయ గల్గెనా" యనుఁడు నతఁడు దన్నుఁ గడుపాఱఁగని పెంచిన తల్లిదండ్రులఁ దలఁచి తలఁచి యన్నియు మఱచియున్న కతాన నేమియుఁ బలుకకయున్నం బ్రత్యహంబు నదియొక పనిచేసికొని నానాటికి నావంత యేవంతయుఁ జెందకుండ వాని డెందంబుఁ గఱగించిన నొక్కనాడు రాజకీరంబు కీరవాణి కిట్లనియెః- "నారీమణీ ! నే నా నీరజాకర తీరంబున నీరూపలావణ్యంబుసూచి మార నారాచ పీడితుండనయి కోరియున్న నాకీ యాకారంబు దెచ్చి ఘోరపాతకంబున కొడిగట్టితివి; దీన నీవేమి మూటఁగట్టుకొనియెదవు? నీ కేమియుప కారంబు నేసితి?" నాఁగ విని యానాగసీమంతిని "యారా రా! యెంతజాణవు! పరులపై నేరంబు వెట్టుట పురుషులకు సహజ గుణంబు; నీ వేమియు నెఱుంగని నంగనాచివి; నోట వ్రేలి డినఁ గఱవ నేరవు; నేను గట్టువాయిని; పాపముల కొడిగట్టు దానను. ఆహా ! ఎంత తగవులధర్మరాజవు ! నాయంత నే వలచినందున నేకదా నాటి నామాటకు మోమాటలేక "తల్లీ, కనకవల్లీ" యని వచించితివి ? వాఁడవు నీవు కావో ? మఱచితివో ? యొకసారి తలఁచుకొను"మనిన "సుందరీ, ననుం దూరకుము. కడుపాఱ నను గనిపెంచిన నా తల్లి పేరు

కనకవల్లి; నా యుల్లంబున నామెం దలంచుకొంటిని గాని నిన్నుఁ గాదు. నీ వది యెందుఁ గాంచి యీ కృతి ఘటియించితివకా తోఁచుచున్నయది. మకరకేతనునితోడు; నే కల్లలాడ; నా ప్రాణంబు నీ యధీనంబు; పాలముంచినను నీళ్లముంచినను నీవే, నన్నుఁ గడతేర్పుము" అనుఁడు, నా మందారమాల యా చిలుకం దన ముంజేత నిడికొని శరీరంబు దిగవిడిచి వచ్చిన చోటికిం జని యెందుఁ జూచిన నది గానరామికి మిగుల వగచి యామదవతి, బెదరించఁబోయి తానే బెదరెనన్నట్లు తొట్రుపడి నిట్టూర్పులు నిగుడించుచు కట్టాయని కళవళించి యెట్టకేలకు నిబ్బరించి కన్నీరు మున్నీరుగా విలపించు చిలుకం దిలకించి "నా వరాలమూటా, నీయొడ లెన్నటికిఁ గసుగందదు; కత్తికిం గంటువడదు; క్రూరమృగంబులు సేరనోడు; నది యెందేని సురక్షితంబై యున్నయది; వెఱవకు" మని బుజ్జగించి యజ్జలజాయతాక్షి హారినేత నఱచేత నిడికొని వియచ్చారిణియై పఱచి పఱచి బహుదేశంబులు సూచి వింధ్యనగంబున డిగ్గి చిలుకతోడఁ గలికి యిట్లనియె; "ఈ ధరాధీశుండు వాగులుగా దానవారి బాఱించు; భూజనులు తన్నుఁ గొల్వ సిరివడయు నలఘు లక్ష్మీవిలాసుఁడై యలరు; నితని కెన్ని కటకంబు లెంత రాజయోగము; చూడుమా! బాపురే! యితండు వితతకల్యాణఖనిగదా, వీని యనవరతనిశ్చలస్థితికిఁ గడు మెచ్చితి. ఇతనికూటములమృదులతాప్తిఁ దేల్చు నునుపు సానువులఁ జూచితె? నూఱులు, వేలు, లక్షలు నని యెన్న శక్యంబు గాదు. వీఁడ గణితవిలాసుండు." నావిని చిలుక "యో పొలతీ, నీ చమత్కృతులకేమి? యితండు సామలసంగతిఁ జాల యొప్పు వంటివి. అవి యవినీతులె కాని, అనవద్యహృద్యగతులు

గాదు. వీనియం దొక్కఁడ మృదులతాదు లుండెంబో స్వవస్తువాహనములు పరాధీనములైన నెట్టుబడియున్నవాని నేల యభివర్ణింప? తనుతగు మగువా, యగణిత విలాసుం డంటివి; సత్యము. అది యేమనిన భీమగురుండు నన్ను ఱేఁగ నూఁకినప్పుడే లెక్కఁజేయని యింద్రాత్మికి గాశీతలేల లెట్లుపోనగు"నని యర్థద్వయంబు గలుగునట్లు కొంతసేపు ముచ్చటించి యొక్కచో నొక మహాగహ్వరంబు గనుంగొని తదనంతరంబున నూర్ధ్వబాహుండై నిమీలితనయనుండై యొడలెల్ల జడలు గ్రమ్ముకొనఁ దపంబు సేయుచున్న యొక మునిపుంగవుం జూచి మందారమాల "ఇది యిమ్మహానుభావుండు దపమ్ము సేయు నిమ్ముగా నున్నయది; ఇచ్చట యలికిడి సేయం గోపించి శపించునేమొ; దీని ప్రక్క నొక దివ్యభవనంబు గానవచ్చెడిని; అందుఁ జని చూతు"మని యాదారిని పోవ మహోన్నతనీలశిలాస్తంభవిభ్రాజమానంబును, బద్మరాగదీపాంకురశోభితంబును నగు నొకమంటపంబు ప్రవేశించి తదంతరాళంబున నడుఁగుమెట్టున నేలనంటి యుటిం తెఱచియున్న కార్తస్వరమయ కవాటం బొక్కటియుం, దానిలోనికిం జూపిడినఁ గ్రిందికిం బోవు స్ఫటికసోపానసంతతియుం గానవచ్చిన, నమ్ముగ్ధియ తద్దర్శనాభిలాష నెందంబున నందడికొన నొక్క మెట్టు డిగ్గి చూతుఁగాక యని చేపిలులేక యూఁచిలుక నవల చేకొందుఁగాక యని, యాతలుపు ప్రక్క నుండుముని యునిచి హస్తద్వితయంబునఁ గట్టిగా మెట్టంచులు పట్టుకొని యొకటి రెండు మెట్లు డిగ్గి చేతులు విడిచి యాలోన నెటులున్నదో చూతమని తలవాంచినఁ జెటుక్కుమని యా

కాలితలుపు మూఁతబడియె. అంత నాచిలుక గుండెలుగొట్టు కొన దద్దిరపడి తనముక్కున నెంతయె త్రినఁ బ్రయోజనంబు లేక "దైవమా, నాడు నట్టడవిలోఁ బలుబాములపాలై యే చెడుమెకంబుల కెఱయగాదునోయని యేకాకినై శోకించు తఱి నీ కోమలాంగివలన మనుఁగడఁ గనియుఁ గారణాంతరం బునఁ బతంగరూపంబునొంది యంగద మునింగియు నీయంగనా సాంగత్యమువలన నా యంగలార్పులు దొలంగించుకొని మేనఁ బ్రాణంబు లున్న నదె చాలునని యీ పరుసుననున్న నాకుఁ గోలుచుట్టుపై లోఁకలిపడియె నన్నట్టీ బ్రతుకుఁ దెఱవైన లేకుండ నీయుడజాక్షి యండబాపిన నీగండంబు నా కెట్లు గడచు'నని వనటనొందుచుండె." అనిచెప్పిన విని కాంతిమతి మెల్లనఁ గరంబున వారింపఁ గలవాణి నుడుగ నుడిగె.

అంత నారాత్రిపుచ్చి మఱునాఁడు ప్రభాతవేళఁ బద్మ పాదుండు నిజసభాంతరంబునఁ బేరోలగంబుండి యఖిలమంత్రి పురోహిత విద్వద్బాంధవుల సమ్ముఖంబున మతిమంతు నాహ్వా నంబుచేసి యిట్లనియె. "నీ వన్వర్థనామధేయుండవు; నీవు చెప్పిన చొప్పున నే నొక్కరుండనపోయి మొన్న నాపొన్న మీఁది కిన్నరపక్షుల పలుకులు వింటి. నీ చెప్పిన యర్థంబు సార్థకంబయ్యెఁ; గాని మనముచ్చటఁ దెలసి యీయూరివాఁడ కాఁబోలు నొక మలినాంబరధరుండు నావేళక వచ్చి యొక చెట్టుచాటునం డాగెనని తద్ధేతుకంబైన కార్యంబు సాంతం బుగాఁజెప్పి సంతానవాంఛఁ జింతిల్లునాకు శకుంతంబులు సంత సంబుఁగూర్ప సంతరాయంబుచేయు చెనటిమనుజుల వారింప నొక్కతంత్రంబు విచారింపవే" యనిన "నట్ల కాక"యని క్షమారమణుండు గొలువు చాలింపుడు మతిమంతుండు నిజ

మందిరంబున కరిగి మది నొకకిటుకు సంబాళించుకొనుచుండె. తదనంతరంబున రాజు పగలువుచ్చి యారేయి యథావిధి విధువదనలంగూడి కథ యడిగినం గలవాణి యావలియుదంతం బుపక్రమించె.

అట్లు వింధ్యభూధరగహ్వారంబున స్మరహాయంబు చంద్రముఖీవియోగ పరితాపంబునం గంపిల్లి తెఱవేది యాలోనం దపోవృత్తిమెనున్న మహాపురుషు కట్టెదుట నొక చట్రాతి నిట్రాటిపైం గూరుచుండి ప్రామిన్కులు సంహితాపదక్రమంబుల జాడలెఱింగి యష్టావధానములను సంధించుచున్నం గొంతవడికి నత్తపసి సుషుమ్నాంతదృష్టి మఱలించి కుంభకం బిడామార్గమ్మున బయలువిడచి ప్రణవంబు బ్రహ్మసుషిరాంతర్లీనంబుచేసి బాహ్యలక్ష్యంబుం గైకొని ముంగిటనున్న యనంగతురంగంబు నీక్షించి శ్రుతిహితంబుగా యజుశ్శ్రుతిం బఠియింప నచ్చెరువడి, "యీ జీవికిం బక్షిలక్షణంబు స్థూలంబుననెకాని సూక్ష్మంబున గానరాదు. పరీక్షింత"మని డాయంబోయి యాజడదారిమేటి తనముందట నిలచినం గని పనన చాలించి "యో శౌపాయుధసార్వభౌమా, నీ సందియంబు నాకుం దెలిసె. తిత్తురులవృత్తంబు చిత్తంబున హత్తింపు మిది క్రొత్తంగా నుండదు. నా నేర్చిన చదువు లుగ్గడింతు నాకర్ణింపుము.

ఋగాదిశ్రుతులు నాలుగు. ఈశ కేన కఠ ప్రశ్నాద్యుపనిషత్తులువేయియు నూటయెనుఁబది. తర్క వ్యాకరణాదిశాస్త్రంబు లాఱు. బ్రహ్మ భాగవతాది మహాపురాణంబులు పదునెనిమిది. మనుపరాశరాది స్మృతులు నూఱు.

సనత్కుమార నారసింహాద్యుపపురాణంబులు పదునెని మిది. హోరాసంహిత సిద్ధాంత రూపంబైన జ్యోతిషంబు సపాదలక్షశ్లోకపరిమితంబు. భారత హరివంశంబులను నితిహాసంబులు సపాదలక్షశ్లోకపరిమితంబులు, సారసంగ్రహ భిన్న బీజాది గణితంబులు పదునొకండు, రాగలయాభినయ యుక్తంబులగు భరతంబులు పది, ధన్వంతరీయ నీలకంఠీయాది భైషజంబులు పది. తంత్రంబులు కోటి, మంత్రంబు లేడుకోట్లు, రసవాది శారీర మణిపరీక్షాశ్వలక్షణాది క్షుద్రశాస్త్రంబు లసంఖ్యాకంబులు, కామందకాది నీతు లనేకంబులు, ధక్క ధమా రేంద్రజాల మహేంద్రజాల గజకర్ణ గోకర్ణాది గారుడవిద్యలు పెక్కులు, ఛందోనాటకాలంకార ప్రముఖంబు లపరిమితంబులు. ఇవి నేర్చియు మన్ననసేయు ప్రభువుం గానక మీ సన్నిధానంబుఁ జేరితి. సదాశ్రయంబులేనినాఁడు పండితులు, వంగనలు, దీవెలు, పరిశోభింపవు. మహదాశ్రయంబు మాబోఁట్ల కవశ్యకర్తవ్యంబు. మఘువు ప్రాపునజీవుండును, దైతేయనాయకులదండను శినుండును, ఇక్ష్వాకునాడ శక్తిగురుండును, జనకుపాల గౌతమసుతుండును, నాతతఖ్యాతిసమేతులగుట మీ రెఱుంగరే? కావునఁ దనరచ్చ నాయునుకువ మేకోలుసేయఁజాలు ధర్మశీలు నొక్క భూపాలుఁ జూపనోపుదురో" యన నమ్మునివరుండు చిలుకపలుకులకుఁ గడునలరి, "ఓ శుకకులవర్యా! భవదీయవాక్సుధావర్ష ధారాసన్నికర్షంబున నామనంబు సంతృప్తంబయ్యె. నేను గపిలుండను భూసురుండ; వేయేండ్లనుండి యీవింధ్యగహ్వరంబునఁ దపంబు సేయుచుంటి; నిచ్చటికి ద్వాదశ యోజన దూరంబున నుజ్జయినీనామ నగరంబు కలదు.

కథ సాంతంబుగాఁ జెప్పినం గాంతిమతి కలవాణి నుగ్గడించి యిరువురు నారేయి నిదురవోయిరి. రాజును నిద్రించె.

అంత మఱునాఁ డరుణోదయంబుననే లేచి ప్రాతఃకృత్యంబులు గడిపి పద్మపాదుండు అచ్చకరిగి మధ్యాహ్నవేళకుం గొలువు సాలించి నిజమందిరంబున షడ్రసోపేతంబుగా భుజియించి కొంతసేపు మగువలతోఁ దుగదచ్చిబార యనుచుఁ బగడసాలయాడి మైదారు గడియల ప్రొద్దుగలుఁగ వనమ్మున కరిగి యా చంద్రకాంతవేది వసించియున్న దివ్యదృష్టిం జూచి కాలజ్ఞాం డిట్లనియె.

శ్లో॥ చంద్రభాగానదీస్నానాత్ ।
భవానీపూజనాదపి ।
అపుత్రాః పుత్రిణ స్సంతు ।
జీవంతు శరదాంశతం ॥

అని యీశ్లోకంబుఁ జదివి యాపులుఁగు జోను తన నిలయంబుఁ బ్రవేశించిన నానేలఱేడును నిజనివాసంబునకుం జని తనభార్యల కిదిచెప్పి యారాత్రి గడిపి మఱునాఁడు అచ్చకు వచ్చి మతిమంతు నాహ్వానంబునేసి యీ శ్లోకంబు జదివిన విని యతండు తలయూఁచి "దీనియర్థంబు నేఁ దెలిపెద, దేవా! చంద్రభాగానదీస్నానం బనుదినంబుఁ బ్రాతఃకాలంబున నీ భార్యలతోడఁ జని సేయుచుఁ బట్టణంబు వెలుపలనున్న కాళికాలయంబునకుం బోయి ప్రత్యహంబు భక్తినియమములు గల్గి పూజింప మూఁడుదినంబులను నీకు మేలునేకూరు" ననిన నాయపసిపాలచంద్రుఁ డా మఱునాటనుండి యట్లసేయుచు మూఁడవనాఁడు కలవాణీకాంతిమతీయుక్తుండై భక్తియుక్తిం

లోకంబున నెంతలేసి లేవు? చూపున కొకపిట్టగా నున్న యది; దీనియెదుట నలుమోములదిట్ట పిట్టయునవచ్చు. అయ్యారె! యియ్యారేడులోకంబుల నింతవింతశకుంతంబు గాన నిమ్ము" సంతసించి యాచిలుకరాయనిఁ దనచేత నిడికొని ముద్దిడి ఱెక్కలు దువ్వి యోమునిచంద్రా, భవదీయకృపా విశేషంబునంజేసికదా నాకిట్టి యపూర్వవస్తులాభంబు. మీ మేలు శతకోటిజన్మంబులకు మఱువనేరువ. దీనికిం బ్రతిసేయ నేదియుంగాన. నాబోటి కించిజ్ఞుండు సేయుపనియేది? మిమ్ముం దృప్తులంజేయునంతకు నొకవందనంబు సేతునని కరకమలంబులు ముకుళించి నమస్కరింప నమ్మహాముని దీర్ఘాయుష్మంతుండవు గమ్మని దీవించి యంతర్ధానంబునొందె.

అంత నారాజు మణికనకసుందరంబైన యొక పంజ రంబుఁ దెప్పించి యయ్యండజం బందుండ నియోగించి తన భారతీనిలయంబునడుమ నిడి విద్యార్థిసముదాయంబులకు వలచినవిద్యఁ గఱప నియమింప నప్పాతశాల నా ద్విజ రత్నంబు విజ్ఞాతంబుసేసిన ప్రజ్ఞావిశేషంబు లగణ్యంబులు. మఱియు నారాజన్యు డాఖగరాజువలనఁ దెలిసిన పరమా ర్థంబు లనేకంబులు," అనిచెప్పినఁ గాంతిమతి సన్నసేయఁ గలవాణి మిన్నకుండె. మఱునాఁడు పద్మపాదుండు తన రాచ గద్దియఁ గూర్చుండి రాజవ్యవహారవిమర్శ నుండ నా మతి మంతుం డాతోలిరేయిన యొక సిద్ధవేషంబుదాల్చి యాపట్టణ సమీపంబున నొక మఱ్ఱిక్రిందఁ గావిపుట్టంబుగట్టి యొడలం తట బూదిం బులిమి గంతఁగప్పి భ్రాంతయొకటి చంక నిఱికించి పర్వనప్తకంబుగల బెత్తంబు చేఁబూని విడిసి "జటిలేంద్ర

స్వామి'' యని పేరుపెట్టుకొని ముక్కుబట్టుకొని వీరాసనం
బునం బీటవెట్టి సంతానరహితులకు వేల్లిత్తునని నెపంబుపన్ని
యున్న నాత్రోవ రాకపోకలుగలవారివలన విని పౌరులలోఁ
గొందరా న్యగ్రోధశాఖకడ కరిగి యపత్యలాభంబున
కుపాయం బడిగిన నొక తాటాకుపైఁ గొన్ని యక్కరంబులు
వ్రాసియిచ్చి "యది పఠియించుకొనుచు నాలుఁమగ లీనాడు
మొదలు తొమ్మిది దినంబులు గృహంబులు వెలు
వడక మడివిడువక పగలు బోసేయుతఱిఁదక్క తక్కినప్రొద్దు
తానిచ్చు నొక వేఱు తాఁ జెప్పు నొకపేరున నభిమంత్రిం
చుచు రాత్రుల బేసిజాల మిథున కర్మంబులు మఱువకుండి
రేని పదియవనాఁడె యెట్టిగొడ్రాండ్రకైనం జూలునిలుచు నని
చెప్పుచు నొకవేరును నొక తాటాకు చీటియు గోరెడు
బూదియు నిచ్చుచురాఁగా నా పట్టణంబున దివాణంబువారి
వలువలు చలువసేయు మడివేలు భార్యాసహితుండై వచ్చి
యా సిద్ధుచేతివిభూతిఁ గొనిపోయి యానాఁడు మొదలు
తొమ్మిదిదినంబులు సెలవుఁగోర రాజమందిరంబునకుంబోయి
యీ వృత్తాంతముసెప్ప ధరావరుండు విని వానియడిగిన
కొలంది గొలువువిడుపున కీయకొని, యీకిటుకు మతిమంతున
దని తెలియక వధూయుక్తుండై పల్లకియెక్కి మఱ్ఱికడకుం
బోయి యాసిద్ధశేఖరుం దర్శించి కోరికఁ దెల్పిన నతండు
వారి నెఱిఁగినవాఁడకాన నృపచంద్రున కిట్లనియె. "ఓమహీ
పాలచూడామణీ, నీకు సంతానంబుగల్గి సంతోషంబున నున్న
నాఁడు నే నడిగిన వరం బిత్తునని యీయాకుమీఁద వ్రాసి
మీ వ్రాలుతోఁడ నిమ్మనిన నట్లకాక యని యక్కడనున్న
యొక తాటాకుచీటిపై వ్రాసియిచ్చిన నంది,"వినుము తేపులే

దెల్లుండి మీ శృంగారవనంబునఁ గిన్నరపక్షులు సర్వంబు
నెఱింగించు నవిచెప్పినట్లు నీ వాచరించితివేని నీ యభీష్టంబు
వత్సరంబులోనన యొడఁగూడు" నని చెప్పిన రాజు నిజమంది
రంబున కేతెంచి దివాంతంబగుటఁ గేళీనిశాంతంబున భూకాం
తుండు కాంతలతో గూడియున్నఁ గాంతిమతి యనుమతిం
గలవాణి కథఁజెప్పందొడంగె.

అచ్చట వింధ్యభూధరగహ్వరంబున నధరమార్గ
సోపానగతమై యెట్టుందార దారిలేక కారాగారబద్ధుండైన
యక్షరాధిచందంబున వలఁజిక్కి పలవరించు పులుఁగులీల
నగ్గోల గగ్గోలుపడి యయ్యో ననుఁగట్టుత్రాడు నేఁ దెచ్చు
కొంటి. నా యొడలికావరంబుననె కడరాని గొడవపాలైతి.
ఈ చీఁకటిలోఁగ నేవంకఁ గాలుమోపుదు ? చిలుకం దలుపు
కడ నునిచితి. అది ననుఁబాసి దుఃఖసాగరంబున మునిఁగి
చాదె ? కట్టా నేనెంతపాపంబు జేసితి? ఇక నేమిసేతు? తేళ్లో,
పాములో, జెఱ్ఱులో; కొణదులో, పిణదులో నేనెట్లు సొత్తు
నని పెద్దయుంబ్రొద్దొకమెట్టునం జతికిలఁబడి వెల్లఁబోయి
చేలాంచలంబునం గన్నీరు దుడుచుచుఁ గపోలమండలన్యస్త
హస్తాబ్జాతమై యతిభీతచేతస్కయయి కొండొకతఱికి గుండె
ఱాయిచేసికొని మెల్లమెల్లన గడియ కొకమెట్టుగడిచి
యొక్కెడ నిల్చిచూడం జల్లని కమ్మతెమ్మెరలు మైసోఁకి
చెమఱువాపిన సేదదీరి యావంకనపోయి కనుంగొన నతిరమ్యం
బైన యొక యారామంబు నిఖిలసుమనఃఫలాభిరామంబై
కాన్పింపనందుసొచ్చి యిచ్చకువచ్చినన్ని తియ్యనిపండ్లుమెసవి
మఱియొకకెలనవోవ నిస్తులజలయంత్రవిలసితంబైన కేళాకూళి
కాన్పింప నందలి మధురజలంబు గ్రోలి దానిపొంత నొక

సికతామయప్రదేశంబునం గొంగుఁబఱచి పవళించి గాఢ సుషుప్తిం బాహ్యాభ్యంతరంబు లజ్ఞానంబున లీనంబైయున్న వేళ నొక మహాభీలదంష్ట్రాకరాళవదనగహ్వరుండైన కర్బుర వర్ణుండొచక్కి నిక్కినిక్కి యక్కోమలిం జూచి యమ్మక్క యని యీచక్కనిచుక్క నాయిక్కకుం గొంపోయి మక్కువం జిక్కదక్కించుకొందుఁగాక యని నిదురలోనున్న దాని నించు కయు గదలనీక తనవీపున నెక్కించుకొని యతిరయంబునం దూర్పుదెసకుం బయనమై శతయోజనాయతంబైన కడలి నొకగడియలోదాఁటి యంధుమానద్వీపంబున నిష్కళయను నిజపురంబు సొత్తెంచి యందు మేదోమాంసరుధిరాస్థిదుర్గంధ బంధురంబైన యొకమందిరంబున డించిన మేలుకాంచి యా కాంచనాంగి యావంచకుని వికృతాకారం బట్టిచూచి చేష్ట లుడిఁగి మూర్ఛిల్లి కొంతవడికి మైదెలసి తలవాంచి కనులం బాష్పజలంబుదటాయింప నేల గీతలుగీయుచుం జెక్కటం జేయిచేర్చి వెక్కివెక్కి యేడ్చుచున్న యాజవ్వనిం జూచి యా తెక్కలిరక్కసుం డిట్టులనియె. "మధురవాణీ, నీవీతీరున విలపింపనేల? ఇచ్చట నీకేమితక్కువ? పులిజున్ను పుట్ట తేనెయుం గలవు. నే నీ చుట్టుపట్టు పదియాఱుదీవులకు దొర తనంబు సేయువాఁడ. ఎల్లరక్కసులు నాపంపుసేతురు. నీవు నాచెట్టఁబట్టినగడియనే నిను పట్టంపురాణింజేసి నేను నీకు దాసుండనై నీకనుసన్నల మెలంగనే? నాపేరుగ్రదంష్ట్రుఁడు. నీ వేది యిచ్చగింతు దా నీకట్టెదుటఁ దెచ్చిపెట్టెద. ముక్కంటియైనను గంటుపఱుపనోపండు" అని గడ్డముక్రింద చెయియిడవచ్చిన నచ్చపలాక్షి యొక్కింత జరిగి మార్గో గముచేసి తనలోఁ దానిట్లని తలపోసె. వీనికిప్పు డెదురుపల్కి

తినా వీని నొక పంటి క్రిందికి నూఱుఁగాయఁగాను. వీఁడు గామరూపుండును, వియద్గామియు. వీనికిం జిక్కినదాన. మఱి యెక్కడికిం బోరాదు. ఇపుడు వీని యీప్సితంబున కియ్యకొనినట్లయుండి యేదేని యొక పన్నుగడ యొనర్చితినా బ్రతుకుగలదు. ముందెటులుండునో! 'నందోరాజాభవిష్యతి' యని మనంబుఁ గుదురుపఱచి, "ఓరాక్షసేశ్వరా, నే నీకుం దక్కినదాన; నెక్కడికిఁ బోనేర్తు? నీయెడ నాకుఁ దమకంబు లేకపోలేదు. చిన్ననాఁడు నే నొక తపసి కపకారంబు నేసి శాపంబునొందితి. ఎవ్వఁడు నాకుభర్తయై మదనకేళిం దేలు వాని శిరంబు తత్క్షణంబ సహస్రశకలంబులై నేలం గూలు. ఈ శాపంబున కొక విముక్తిసాధనం బాతపసియ కలుగఁజేసె. చదియని శవము, చదివిన శుకము, ఇవి రెండును నెవ్వఁడు నా కనులంబడు నప్పుడు నా కా శాపదోషంబు వాయు. ఆ రెండు వస్తువులును మదక్షిగోచరంబులు కానినాఁడు నీవు వరించితివేని మృతుండ వగుదువు. ఇట్లని దుఃఖించుచుంటిని. అవి నీకు సాధ్యంబా నేని తెచ్చితివా సంతతానందసుఖపరవశుండవై చనవె? నా కౌఁగిలి యెన్నఁడబ్బు నపుడే నీకు రంభకౌఁగిలి యబ్బినట్లు నీ దేహంబుబ్బిపోదె. నా మోవియూన నెపుడు గలుగు నపుడు నీ కిహము దెలియునే? యమృతపానంబుఁ జేసినట్లనిమేషభావంబునొందవే? భళిర! నాతోఁడికలయిక వలయు నాఁడు నీ యెడ లిట్టులనెయుండునా? పోతవిగ్రహమువలె నలరుచున్న నినుం జూచి నరులందరు నానందింపరే! అపుడు నీవొకరితో మాటలాడి యొకరి మనవులు విని యొకపని చేతువా? అవునుగాని దానవేశ్వరా, నీ దీర్ఘదంష్ట్రికలకు నరశరీరంబులు వడియములా, విడియములా? మేలుమేలు

నీబాహుదండంబుల యండ నుండఁగల్గిన వేదండయాన కీఁక భూలోకంబేల? కావుననే పుణ్యజనోత్తముండవైతివి.” అని తెగడుచున్న రాక్షసాధముం డవిపొగడ్తలకాఁ దలఁచి యఁది యన నెంతపని భూమ్యాద్యూర్ధ్వలోకంబులేదును నతలాద్యధోలోకంబులేదును వెదకి యారెండు వస్తువులు దెచ్చి నీ కట్టెదుటఁ బెట్టనే”యని తలపంకించి మీాసంబుదువ్వి యక్కుసుమగంధి వసియింప నొక చారుసౌధంబు నిర్ణయించి మనుజయోగ్యంబులైన యాహారంబు లమర్ప సకలోపచారంబులు సేయ రాక్షసాంగనల నియమించి యాముద్దియపై యీఁగ వ్రాలకుండఁ గట్టుదిట్టంబులుచేసి శవశుకాన్వేషణపరుండై సర్వలోక సర్వదేశంబులు శోధించుచుండె.

అంతనారాత్రి ప్రొద్దుబోయిన దని కాంతిమతి యూఁకోలు సాలింపఁ గలవాణియుఁ బవ్వళించె. ఆమఱునాఁడు పుడమితేఁడు హజారంబున నొడ్డోలగంబుండి మతిమంతుండు చీటిం దెచ్చియిచ్చినం జదివికొని తనలోన నవ్వుకొని యతండుపన్నిన పన్నుఁగడకు సంతసించి యాప్రొద్దు కొలువు నిలకడసేసి వనంబునకుఁజని యెప్పటియట్లయున్నఁ బొన్న కొమ్మపైనున్న దివ్యదృష్టి కాలజ్ఞున కిట్లనియె. “జీవితేశ్వరా, యీాకువలయేంద్రునింగంటె? వాడినమోముదమ్మితో, కూడినచింతాభరంబుతో, నీ వేదియేని దయచేసి వాక్రుత్తువని యాశించి వచ్చియున్నవాఁడు. నీవెల్లయర్థంబు లుపదేశింప సమర్థుండవు కావుటంబట్టి నీకు విన్నవించితి. నన్నుమన్నించి యీా మన్నీనికిం బుత్రోత్పత్తిసాధనం బుపదేశించి రక్షింపుమీా” యనినఁ గాలజ్ఞుండు “నా యనుంగా, యది నే

నెఱుంగదు; నేఁడు మూఁడామడ పయనంబు పఱచితిమి; ఱెక్కలు నొచ్చుచున్నయవి, యీరేయి కూఱుకున నవయవశ్రాంతి శాంతిల్లు. ఱేపు తప్పక చెప్పువాఁడ"నని విని వసుధాకాంతుం డొకింత సంతసించి యహస్పతి యపరగిరి కరిగిన గృహంబున సహవేణులంగూడి యెప్పటియట్లు వర్తింపఁ గాంతిమతి యానతిఁ గలవాణి కథ ముగియింతు ననుచు నిట్లనియె.

అంత నచ్చటఁ భోగవతీపురంబున రత్నఫణుండు తన కుమారితె తా నునిచివచ్చిన కళేబరంబు గొనివత్తునని పుడమి కరిగి తడవాయె; రాదాయె నేమి చిత్రమో యని కాఁచి కాఁచి యెంతకు రాకున్న శోకాకులుండై మనుజరూపంబున సర్వంసహాలోకంబు నన్వేషణంబు సేయుచు వచ్చుచోఁ గపిలదేశంబునఁ గబళాపత్తనంబుఁ బ్రవేశింపనందుఁ బ్రభాకరుండు నిజపుత్రకళేబరంబు సంరక్షించు విధంబు విని తన కూతువలన నభిమంత్రితంబైన వట్టియొడ లదియకా నిశ్చయించి వెజ్జువేషంబుదాల్చి యాభూసురసింహు భవనంబునకుం బోయి యయ్యచేతనంబైన మానినిబొమ్మంజూచి కరపాదకంఠస్పర్శంబుచేసి యూర్ధ్వదృష్టి నొక నిముసం బాలోచించి "భూసురాగ్రేసరా, నా కీగుణంబు దెలిసె; నిఱుబది దినంబుల దీని కూపిరిసంధింతు; నావిడిది నిడుం" డనిన నేతీరుననైన సుతుండు ప్రాణసమేతుండు గాఁగోరినకతాన "నా పుడమివేల్పు దానికొడఁబడి యవ్వెజ్జు నాయూర నొక్కచో విడియించి యానిర్జీవగాత్రంబు వానికై వసంబు చేసిన నతండు పవల్లెల్ల విడిది విడువక రేయిం గామరూపుండై యాయొడలు మోఁచికొనుచు నానాదేశంబులు దిఱుగుచుండెఁ. ఇట్లుండ నుజ్జ

యినీ నగరంబున నమ్మహాశుకకవి యనుదినము నొకజాము భూమీశునకు నీతులుపన్యసించుచుండ నొకనాఁడు మందాకుం డను నొక చార్వాకుండు రాచరచ్చకువచ్చి యీశ్వరుఁడు లేఁడనియుఁ బదార్థసమితికిఁ బరిణామాదులు స్వతస్సిద్ధంబు లనియు శ్రుత్యర్థంబు లయథార్థంబులనియుఁ బురుషున కిహము దప్ప వేఱొండు లేదనియు వాదింప వాని పొగరడపఁ జిలుకం బురికొల్పిన వారిరువురు నీ రీతి సంభాషణకుం దొరకొనిరి.

## శుక చార్వాక సంవాదము

చా॥ ఈశ్వరుం డననేమి?

శు॥ ప్రపంచ సృష్టిస్థితిలయంబులకుఁ గారణంబైన వ్యక్తి.

చా॥ భూమ్యాదులే కారణంబులై యున్నవిగాన వేఱొక వ్యక్తిఁ జెప్పనేల?

శు॥ జడంబులైన కేవల భూమ్యాదులు చేతనంబు గల్గించు ననుట ప్రమాణరహితంబు గాన భూమ్యాదులును గారణాంతరంబు నపేక్షించు.

చా॥ ఆవ్యక్తి యెచ్చటఁ గానంబడు?

శు॥ మనయంద.

చా॥ అది యెట్లు?

శు॥ భూమ్యాదిభూత సమిష్టి మృతజీవచ్ఛరీరంబులఁ దుల్యం బుగా వ్యాపించియుండ భిన్నలక్షణలక్షితంబు లగుట మనము చూచుచున్నారము.

చా॥ జీవంబు లేమింజేసి భేదంబు మృతశరీరంబునం గాన వచ్చెడిని.

శు॥ జీవం బన భూమ్యాదుల నెద్ది?
చా॥ భూమ్యాదులలోనిది కాదు.
శు॥ అట్లైన భూమ్యాదులకు సర్వసృష్టిస్థితిలయహేతుత్వం బెట్లు గలుగు?
చా॥ అట్లైన జీవుండే యీశ్వరుండు గావలసివచ్చును.
శు॥ ఔను! జీవసమిష్టికే యీశ్వరుం డని పేరు.
చా॥ అట్లైన నచేతనంబుల కీశ్వరుం డెట్లు కారణంబగు?
శు॥ జీవునకు శక్తులు రెండు. గంధాదిగుణవతి యగు శక్తి యొకటి, అది యచేతనంబుల సర్వత్ర వ్యాపించియుండు. అందువలననే బ్రహ్మాండగోళంబు లన్నియుఁ బరస్పరాకర్షణ సమర్థంబులయ్యె. బుద్ధిసుఖదుఃఖేచ్ఛాది రూపగుణవతి యగు శక్తియొకటి. అది చేతనంబుల నంతట వ్యాపించి యుండు. అందువలననే మనుష్యుండు మాటలాడుట,నవ్వుట,నిదురబోవుట, యేడ్చుట, భయంపడుట, మొదలగునవి కలుగుచున్నవి. ఈద్వివిధశక్తులు మనకు బ్రత్యక్షంబులు. కావున ద్వివిధ శక్తియుక్తంబైన జీవసమిష్టి ఈశ్వరుండునాఁ బరగు.

అనిపల్కిన చిల్కతో మాఱుపల్కలేక సిగ్గుపడి మందాకుండు దన తొంటివాదంబులు మాని చిల్కకు నమస్కరించి యీశ్వరభక్తియుక్తుండై చనియె. అపుడొక విప్రవేషంబునఁ దత్సభాంతరంబున వినుచుండి యుగ్రదంష్ట్రుండు మిగుల నాశ్చర్యంబు నొంది నా కార్యంబు నేఁడు సఫలంబయ్యెనని తలఁచి యా రేయి నడిజామునఁ జిలుకతోడం బంజరంబు దక్కించుకొని యుప్పరం బెగసి పాఱిపాఱి ప్రాక్సముద్రతీరంబున నొక యరణ్యంబుఁజేరి యందొక శాఖక్రింద

నా పంజరంబు వెట్టి నలుదిక్కుల గనుంగొనిన చూపుమేర నొకమానిసి పోవు సవ్వడిగట్టి యాదిట్ట పంజరంబు గైకొని వడివడిఁ గదియఁజని మెల్లమెల్లన వెనువెన్కఁ బొరసిపొరసి వానివీపుపైఁ జానిదానివలెఁ గానిపించు పీనుంగుఁ జూచి "యేకక్రియాద్వ్యర్థకరీ" యని సంతసించి కికురించి గట్టిగాఁ బట్టి నెత్తి నెత్తుకొనియె.

అంత నిక్కడ చిలుకలేమి బాలకుఁ వలన విని మిగుల వగదట్టి యేదియుం దోచక నృపాలచూడామణి రాజ్యంబు గోలుపోయినవాఁడునుంబోలె నిదురలేక దన కాపద్బంధుం డైన కపిలు మదిఁదలఁచిన నా నిముసముననె యమ్మహాముని ప్రసన్నుండై నా వలనఁ గావలయునది యెద్ది యనిన నాఁడు దేవర ప్రసాదించిన మంచిచిలుక యేడఁబోయెనో బడిలోఁ బంజరంబుతోడ లేదనిన నత్తపసి తనయోగదృష్టి నంధుమాస సమీపంబున రక్కసుని చేఁజిక్కియుంటఁ గాంచి యాతేని వెఱవకుమని యూఱడించి పక్షిరూపుండై గగనమార్గంబునం బోయి ప్రాగబ్ధి దరిసి యాదారిన తెక్కదారియై రక్కసు వెన్నంటిపోవు రత్నఫణుఁ జూచి యాతనివలన రక్కసు మొక్కలంబు కొంత యెఱింగి యిఱువురుఁ గలసిపోవుచుఁ రంగత్తరంగ దుర్వారంబైన ప్రాక్పారావారంబుఁ జూచి యాతాయాతపోతవ్రాతసమేతంబై పక్షచ్ఛేదభయంబున నిజ గర్భంబునం డాగిన భూభృత్సముదయంబునకు నింద్రదారి యదే తూర్పుదెసకు దండుబోవుచున్నాఁడు లెండులెండు, బాసట పొండని వెలువరించెనో యన తండోపతండ డిండీరఖండమండి తంబై యండజేంద్రుఁ డాఖండలపురినుండి యమృతభాండంబు గొని తెచ్చునాఁడు శతకోటితోటి దీటింపఁ బోవుతఱి ఫీటిపాటై

యేపాటియేని యీ నీటంబడియెనో యన విశాలశైవాలజాలవినీలంబై నీలకంధరుండు త్రిపురాసురుల జయించి మఱలఁ దన యంపదొన నారాయణశరమ్ము దాచెనోయన నుత్తుంగరంగత్తరంగసంగంబై నింగినున్న బలాహకంబులకు నీరుబెట్టుచున్నదోయని యభివర్ణింపఁదగియున్నదని యొకరికొకరు చెప్పుకొనుచుఁ బోయిపోయి రక్కసుఁడాసియున్నతఱిఁగపిలుండిట్లనియె "ఓరీ, సురవైరీ! నీ వీరీతి చిలుకం దస్కరించి పందవై పఱవ నీతిగాదు. ఇష్టమ్మయేని సామమ్మున కీకొమ్ము. సొమ్ము వలతే జంబూనగనదమ్ము నీ వశంబు జేతు, నీవు కడిఁది మగండవేని పగఱ నాలంబుననోర్చి జయభేరి మొఱయ శుకమ్ము గొంపొమ్ము. ఈ పిట్ట నీకేమి కట్టిపెట్టు? కావరమ్మున కనుఁగానక పట్టరాని పట్టుపట్టి పట్టికోలు మేలుకాదు. వినరా రేద్రిమ్మరీ! నిష్కారణమ్ము మైథిలిం జెఱపట్టి దశకంధరుండు సపుత్రమిత్రబాంధవుండై సమసె. 'ధర్మోజయతి'నా వినవె? బాపనపోటును, కప్పకాటును లేదనుకొనకుము. సాదు రేఁగిన సహదేవుఁడుఁ గట్టలేఁడు, పోకుపోకుమని వెన్నంటి తఱుమ, నా మొఱకు రక్కసుండు వడిఁబాఱి నిజసౌధాంతరమ్మున సుందరీ సముఖమ్మున శుకశవమ్ములను డించి యిదె నా కెఱవొగకెఁ జలిదిఁ గుడిచి శీఘ్రంబ వత్తుననుచు పత్తులై పఱతెంచు కపిల రత్నఫణుల కెదురువచ్చి జెబ్బసఱచి పెదవి గఱచి బొమలుముడివడ రోషభీషణంబులైన భాషణంబుల నిట్లనియె. "ఏరా! యింతదనుక నేవొ కాఱుకూఁత లఱచుచున్నాఁడవు. కోడెక్రొవ్వి యాఁబోతుపై అంకెలు వైచినట్లు హనుమంతునిముందటరా కుప్పిగంతులు? నవోఢరున నీతరమా? ఇంత పోతరమా? ఎలుక వచ్చిపిల్లిని వెక్కిరించె

శనినట్లు మీ మగంటుములు నా యెదుటనా? పదితలలవాని పోలిక నాకేల? వాఁడు నా గోటికి సాటిరాఁడు పక్కులారా! నొక్కినముల నానోటి కఱవక్క లగుదురా! ముక్క లగుదురా? మీ పోఁడిమి పొక్కింతు నిదె చూడుఁ" డనుచు బ్రహ్మాండభాండంబు బీటలువాయ నట్టహాసంబుచేసి గద్దించి యా కపిలు మోర నొక గ్రుద్దు గ్రుద్దినఁ దదాఘాతంబున నొచ్చియు పిఱుతీయక "నోరీ, నీ కండలు గ్రద్దలపాలు చేతు నిలు" మనుచు నిజపక్ష వాతోద్ధూతబలాహకవ్రాతుండై యురువడించి మండితమండలాగ్ర నఖంబులైన తన పాదనఖంబుల నా రక్కసుమోర గీరిన రక్తసిక్తవదనుండై వెనుకంజ వేయక భీకరంబుగ బోకరింపుచు మునిరాజు నొకతన్ను దన్న వచ్చిన నడుమ నడ్డమై తత్నఫణుండు దన నిజసర్పరూపంబుఁ దాల్చి ప్రళయకాలాభీలకీలికీలామాలామూలంబైన కాకోలంబుఁ గ్రక్కుచు యోజనాయత ఫణసందీప్తమాణిక్యచ్ఛటాచ్ఛటలు దిక్తటంబుల నటింప ఫూత్కారమేదురంబై రోదోంతరంబు భేదిల్ల నా గండాగొండికండదిండి దండచేయి కండఁ గాడఁగఱచిన కాటుతోన నేలంగూలి వాయిఁ దెఱచి యాడు గఱచి గంతుగొట్టినం గాంచి యా ద్విజహ్వాచూడామణి కపిలు దాపుసేత నతండును నిజమునిరూపంబువహించి పన్నగేంద్రుఁ బహువిధంబులం గొనియాడి "యో యన్నా! నేను వింధ్యభూభృద్గుహాధివాసి నగు కపిలుఁడ. నాకుం బ్రియమిత్రుండైన యుజ్జయినీ పాలకుఁడగు చంద్రకేతుమహారాజు పంపున నతని విద్యాశాల బాలకులకుఁ జదువులు గఱపు వలఁతి చిలుక నీ పలుఁగు పొలుసుదిండి తెక్కలించి తేఁత నవి

యంతర్దృష్టిఁ బరికించి యిటవచ్చితి. నీ చరితంబు వినవలతు” నావుడు గూఢపాత్రప్రభుండు వాఁడు చెప్పిన చిలుక తన కూతు చేతిద కావచ్చునని యాఁడబోయినతీర్థ మెదురాయె సెబాసని మది సంతసించి తా భోగవతీపురంబునం గాపురంబుండు రత్న ఫణుం డను వాఁడ ననియుఁ దనయాఁడుబిడ్డ విద్యావంతంబైన శుకంబుతోడఁ గానరామికి నెమకఁబోఁ గపిలదేశంబునం గబళాపురంబునఁ బ్రభాకరుండను భూసురుని పనుపునఁ దత్కు మారనిర్జీవకళేబరంబునకుఁ గాపున్న నదియొకరేయి సముద్ర ప్రాంతకాంతారమ్మునసే నిశాటాపహృతంబైన వెన్నంటిరాఁ దెన్నన నిన్నుఁ గాంచితి ననిన విని యారా! యా చిలుక యీ చిలుకయే కావచ్చునని తలఁచి యొండొరులుం దెలియం బలికికొని నిజాంగంబులతో నిష్కళానగరంబునం దిఱుగు చున్న నింతలోన మందారమాల తనయెదుట నిల్పిన శుక శవంబులంగని యలరి నేర్పున నొరులకుఁగానరాకుండ శుకంబు లోని యూపిఱి మనుజశరీరంబులోనికిఁ జొన్పి యా కీర కళే బరంబుఁ బాఱవైచిన విద్యానాథుండు నిదుర బోయి మేల్కాంచినట్లు లేచి మృదుమధురభాషణంబులం జెలియు నలరించుచు “నో ముద్దులగుమ్మా! యావింధ్యగోత్ర గుహాం తరంబునం బెనుగొందిఁబడిననుఁ దలఁపుచెంత నిడి మాయమై నది మొదలు నా కస్తి యే రెఱుంగుదురు? అందుండి యీ మధ్యేసముద్రంబున దీవికెట్లు రాఁగంటివి వాలుగంటీ” యనుడు సవిస్తరంబుగా నత్తెఱంగెల్ల నెఱింగించి “నా నవ మన్మథాకారా! నిన్నాకొండసారియదండ విడిచిననాటంగోలె నా గొడవ నుడువ శక్యంబె? అచ్చటనుండి నీ వెందుఁబోయి యుసురుం దక్కించుకొంటివో చెవులపండువు సేయవే” యనిన

నా పాటుల రాచకూన పోకలెల్ల వివరించి రక్కసుండు వచ్చునో యేదిసాధనం బని విచారించుచుండం గపిలరత్నఫణులు గాన్పించినం జూచి యుల్లంబులు ఝల్లన దిగ్గున లేచి వారిరువురు నెదురువచ్చి నమస్కరించినం దీవించి యత్యంత సంతోషభరితాంతరంగులై యుండ నందు రత్నఫణుండు తన ముద్దుపట్టి నడుగ నప్పుడతి తమయుదంతం బంతయు శుకశరీర విసర్జనాంతంబు విశదంబుసేసి తండ్రివలన వారల యుదంతంబు రక్షోవధాంతంబు విని యావలి పని యెట్లు గావలయు నని యడిగిన నుదురాజముఖికిఁ గపిలుం డిట్లనియె.

"ఇది యంధుమానం బనుదీవి; నరాశనుల కునికిపట్టు. మసలరాదు. గగనగమనంబున నుజ్జయినికిం బోయిన నచట సకలంబును భద్రం బగు" ననిన లగ్గని యందరు నభోయానంబున నుజ్జయిని తెఱవుఁ బట్టి కపిలుఁ బురస్కరించుకొని యాపట్టణంబునం డిగ్గి రాజమందిరంబుఁ బ్రవేశింప నా భూపాల కుంజరుండు మహిషీసహితుండై వచ్చి కపిలునకు నమస్కరించి యథావిధి నందఱం బహుమానించి కూర్చుండ నియోగించి ఋషిరాజునకు రాజిట్లనియె. "మునికులసార్వభౌమా! చదువుల చిలుక నెడబాసి నిద్రాహారంబులు త్యజించి కృశించుచుంటి. భగవదాగమనంబున కాసపెట్టుకొని మేనఁ బ్రాణంబు లున్నయవి. భవన్ముఖంబున నేవార్త విందునో భయంబగుచున్నయది" నా విని మానిచంద్రుండు "మేలు, నీ చదువుల చిలుక యిదియ చూచుకొ"మ్మని విద్యానాథుం జూపి జరిగిన కతయెల్లఁ దెల్పి తోంటి పంజరంబుం జూపి నమ్మించి మందారమాల నెదురనిల్పి "యీ చిన్నది నాగకన్యక, అతం డీమె యయ్య, రత్నఫణుండను భోగీంద్రుండు" అనిన విని

యా రాజేంద్రుని పట్టంపుదేవి లక్షణాదేవి యా కులుకులాడిం జేయిపట్టుకొని "యో బంగరుబొమ్మా! రారమ్మా" యని శుద్ధాంతమ్మునకుం దోడ్కొనిపోయి యిష్టసల్లాపంబుల నున్న, నిచట రాజు విద్యానాథరత్నఫణులకు విడిది నియోగించి వందనంబుఁజేసి మునిచంద్రు వీడ్కొని యా నాఁడు పుచ్చి మఱునాఁడు వారిరువుర రావింప ఫణివల్లభుండు జనవల్లభున కిట్లనియె,

"అయ్యా! నే నీచిన్నవానిం గపిలదేశంబునఁ గబళాపురంబునఁ బ్రభాకర కనకవల్లుల కొప్పించకున్నం దబ్బర మానిసి నగుదు; పిమ్మట మీ చిత్తవృత్తిరీతి నీ కుఱ్ఱని మీ వాని జేసికొనవచ్చు. నే మఱల వచ్చువఱకు నా పిల్లదాని మీయింటఁ బోషింపుఁ డని పల్కిన రాజు వల్లెయని సెల వొసంగ మందారమాలావియోగంబునకు విద్యానాథుండును విద్యానాథుని వియోగంబునకు మందారమాలయు లోలోనఁ గ్రాఁగుచుండియుఁ దఱిగామి నేమియు ననఁజాలకున్న రత్నఫణుండు బాలకుఁ దోడికొని సరిగా నిరువదియవనాఁటఁ బ్రభాకరకనకవల్లుల కట్టెదుట నిల్పిన నప్పటి వారి యానందంబునకు మేర లేదుకదా!

అంత నచ్చట నుజ్జయినీనగరంబున నా రేయి పండు వెన్నెలలం బ్రాసాదతలమ్మునం బయ్యెర లొయ్య నొయ్యనఁ బయి డాయ మందారమాల విరహవేదనాదోదూయమానమానస యగుచు శీతకరశీతవాతులాండజాతసంఘాతసమేతచేతోజాత యాతనాతిభీతచేతస్కయై యే తెఱంగుఁ దోపక వేదురుపట్టినట్లు యిటునటుఁ దిరుగుచున్న యా కన్నియ చిన్నియ యెల్ల సూచి లక్షణాదేవి చేరవచ్చి "కోమలాంగీ, యిది

యేమివింత? నీకేదైన సోకుదాకెనో; కాకున్న నీకరణి నున్న కారణంబేమి? యనిన "మానవతీ! నే నాన విడిచి నీ తోన కాన యనుదాన. చక్కెరవిలుకాని యాన. నా చిత్త విత్తంబు సర్వంబు నపహరించిన చోరు భూసురకుమారు విడ నాడి నేనెట్లు మనుదాన? ఔఁగాని అదిగో చూడుమా, ఉప్పు రాన నిప్పులకుప్పచందాన నా యెడ లుడికించుచున్న దది యేమిటమ్మా? వీని శీతకరుండండ్రు. కవులెంత విపరీతవాచు లమ్మా" యని, కుముదబాంధవు సంబోధించి "ఓ కువలయా ధీశా! నీవు సాధుచక్రంబులకు బాధకుండవు. రుద్రాక్షివై భూతిపాండురశరీరుండవై యనవరత జంగమాచారుండవైన లింగధారివి. నీవు రామానుజకులజుపొత్తు హత్తితివి. నీకు నిలకడ యేడది? ఓరీ, నీ సిరి నడమంతరము. నీ స్థితి రెణ్ణాళ్ల పట్టపగలు. తేలు ముట్టినప్పటి నీ నీచగతి, పాముగఱచినప్పటి నీ బాములుఁ దలఁచుకొనుము. నన్నేల యేచెదు? ఇస్సిరో పోరా"యని యొక్కింత దడ పూఱకుండి పంచబాణుఁ డెదుట నున్నట్టు కల్పించుకొని "ఏరా, మారా. హరికుమారా! నీ నారాచంబులు ఘోరంబులయ్యె. నేజెల్ల, నీ వా శాంబరీ భిల్లుని కంటిమంట లంటిననాఁడె చాకుంటివి. నీ తలిరాకు బాకెంత? నీ పూలగోల లెంతలేసి? నీ చెఱకు విల్లేపాటి? హరి బలంబున నదరిపడియెదవు. తగదురా నీకీ పరమచండాల గుణము; ఆద్యంతరసహీనమైన ధర్మము; ఆసహాసక్తమైన యంబకము. నా జోలికి రాకురాకు" మని తలపంకించి కనులు చిట్లించి యుస్సురస్సురనుచుఁ దోటకూఱకాఁడవలె వాడి వత్తిలై వ్రాలిన యా బాలికం జూచి లక్షణాదేవి తన చెలి

కత్తియలతోడఁ బన్నీట జలకంబార్చి, పద్మపత్రంబులు మేన హత్తించి చందనాగరుకర్పూరాది వివిధ శీతద్రవ్యంబు లంగ లేపంబుసేయఁ గొండొకవడికిఁ దెలివినొందియున్న యా మందయానం దోడికొనిచని లక్షణాదేవి యదియంతయు రహస్యంబునం బెనిమిటికి విన్నవించిన నతండు కరుణార్ద్రహృదయుండై శీఘ్రంబ విద్యానాథు రావింతు వగవకుమని యూఱార్చి విరహానలంబు చల్లార్చి తనభటునొక్కరుం బిలిచి ప్రభాకరుపేర నొకజాబు వ్రాసియిచ్చి యిది కొంచుఁబోయి కపిలదేశంబునఁ గబళాపురంబునఁ బ్రభాకరనామభూసురున కిచ్చి వైళంబ రమ్మనిన వాఁడట్లపోయి యా యుత్తరంబు ప్రభాకరున కిచ్చిన రత్నఫణుండు వినుచుండ నతండిట్లనిచదివె.

" శ్రీమద్యజనయాజనాధ్యయనాధ్యాపనదానప్రతిగ్రహషట్కర్మనిరతులైన ప్రభాకరభూసురేంద్రుల సమ్ముఖమునకు.

భవత్పాదసేవకుండు చంద్రకేతుం డనేకనమస్కారము లాచరించి చేయంగల విజ్ఞాపనమ్ములు.

మీ దయావిశేషంబున మేమందర మిచ్చటఁ గుశలంబుగ నున్నారము. మీ శుభాతిశయంబులు వ్రాయంగలరు. వెండియు భవత్కుమారుండు విద్యానాథుండు శుకాకారుండై యుండునాఁడు నామందిరంబుసుందరంబై నే నమందానందంబు నొందియుంటి. నేఁ డతండు దైవానుగ్రహంబున గృహీతనిజ మనుజవిగ్రహుండై రత్నఫణుంగూడి తల్లిదండ్రుల మిముఁ గాంచి నమస్కరించి మీ కానందంబు నమకూర్చి మీచే దీవనలు బడసివత్తు నని చెప్పి యచ్చటికి వచ్చియుండె. ఇచ్చటనున్న రత్నఫణతనూజాత మందారమాల తత్సందర్శనాభిలాషం

గందర్ప శరావిద్ధయై యున్నయది. అది యట్లుండ విూ కొమరునకు మంత్రిత్వం బొసంగి నా పీట నునిచి మన్నింప నాకుందలంపు గలదు. కావున రత్నఫణుం బనిచి యెల్ల కర్జంబులుం జక్క సేత నాకిష్టంబు. దయయుంచ వేడెద.

చిత్తగించవలయు"

ఇట్లు పఠింప నాలించి రత్నఫణుండు తనకూతునకు విద్యానాథునిపైఁ గూర్మిఘటిల్లియుంటఁ దలంచి, యా ద్విజ సింహుని జూచి, "దేవా! నీబిడ్డనికి నాబిడ్డం బెండ్లిసేయ నాకుం గరం బభిమతంబు. నీచిత్త మెట్లుండెనో" యనం గనక వల్లి రావించి, జంద్రకేతుని లేఖ వినిపించి, రత్నఫణుఁ డాడి నది వివరించి, యాయమ యాకోలు దెలిసి, లెస్సయనిన రత్న ఫణుండు కూతుం దోతెత్తునని యుజ్జయిని సని యది యంతయు భూకాంతునకుఁ దెల్పి, రాజునాజ్ఞ బిల్లదానిఁ బల్లకినెక్కించు కొని మితపరివారంబులోఁ గబళసేరిఁ విడిసినం బ్రభాకరుండు గుమారవివాహమహోత్సవంబు సాటించి యాప్తబంధువర్గం బులకు శుభలేఖ లనిచి గృహంబు బహువిధంబుల నలంకరించి యొక్క శుభముహూర్తంబున శుభగ్రహంబు లేకాదశస్థాన గతంబులును గ్రూరగ్రహంబులు త్ర్యాయారిగంబులునునై యుండ విచారించి, తారాబలచంద్రబలంబులు గల యొక శుభ దినంబునఁ బంచమహావాద్యంబులును బ్రాహ్మణాశీర్వాదంబు లును బోరుగలుగ వధూవరుల వివాహవేదికకు రప్పించి లగ్నాష్టకంబులు పఠించి రత్నఫణుండొక బంగారుపళ్లెరంబున విద్యానాథుపాదంబులు గడిగి మందారమాల ధారవోసి తాలి గట్టించి సప్తపది మొదలు శేషహోమాంతంబు యథావిధి

వివాహంబు నెఱపి మహదాశీర్వచనకాలంబున విప్రసహస్రంబులకు భూగోహిరణ్యవస్త్రాదిదానంబు లిచ్చి నాకబలి సేసి, డోలాతాంబూలచూర్ణోత్సవంబులు జరిపి గృహప్రవేశంబు సేయించి సకలసంతోషంబుల వెలయుచు నగరు పెండ్లి సేసి వధూవరుల దీవించిరి.

అంతఁ బదియాఱువాసరంబు లరుగ రత్నఫణుండు భోగవతికిం బోవఁదలఁచి గాదిలిపట్టిపాలికింజని "మాయమ్మా! నేనూరికిం బోయవత్తు; నిన్నే పేట నా వీటికిం గొంపోయి కలకాలఁది పసుపు కుంకుమఁబెట్టి పంపుచుండు; బెంగలేక వర్తింపుము; నీ కిచ్చట సకల సౌభాగ్యంబులు గలవు; నీ భర్త చంద్రకేతుని అచ్చమంత్రియగు; ఏమొడఁ గొఱంతలేదు; అత్తమామ లేమిచెప్పిన నడుగుదాటక సేయవలయు; మగఁడు గుడువకమున్న కుడువరాదు; గొంతెత్తి పెద్దమాట లాడరాదు; తలవాకిట నిలచి తలవిప్పరాదు; రహస్యంబున సోదరు నేని పురుషు దరియరాదు; పలుమారు నవ్వరాదు; మగఁడూరలేని తఱి మంచముపైఁ బండరాదు; భర్తతోఁ జెప్పని పని సేయరాదు; గృహకృత్యంబులయెడఁ బరామరికఁ గలిగి యుండవలయును; పగలు నిదురపోఁరాదు; పనియున్నపుడు పాలుమాలరాదు; చెడిపెలసంగాతంబు సేయరాదు;" అని బుద్ధులుసెప్పి తనపోకకు వగచు నా చిన్నికన్నియ కన్నీరుఁ దుడిచి యూఱార్చి రత్నఫణుండు నిజవాసంబునకుఁ జనియె.

అంత విద్యానాథుండు తలిదండ్రుల యనుమతి మందారమాలాసహితుండై యుజ్జయినికిఁ జని యచ్చట నా రాజు నొద్ద మంత్రిత్వంబుసేయుచు సుఖంబుండె" నని

కథ సాంతంబుగాఁ జెప్పినం గాంతిమతి కలవాణి సుగ్గడించి యిరువురు నారేయి నిదురవోయిరి. రాజును నిద్రించె.

అంత మఱునాఁ డరుణోదయంబుననే లేచి ప్రాతఃకృత్యంబులు గడిపి పద్మపాదుండు అచ్చకరిగి మధ్యాహ్నవేళకుం గొలువు సాలించి నిజమందిరంబున షడ్రసోపేతంబుగా భుజియించి కొంతసేపు మగువలతో ముగదచ్చిబార యనుచుఁ బగడసాలయాడి మైదారు గడియల ప్రొద్దుగలుఁగ వనమ్మున కరిగి యా చంద్రకాంతవేది వసించియున్న దివ్యదృష్టిం జూచి కాలజ్ఞుం డిట్లనియె.

శ్లో॥ చంద్రభాగానదీస్నానాత్ ।
భవానీపూజనాదపి ।
అపుత్రాః పుత్రిణ స్సంతు ।
జీవంతు శరదాంశతం ॥

అని యాశ్లోకంబుఁ జదివి యాపులుఁగు జోడు తమ నిలయంబుఁ బ్రవేశించిన నానేలఱేడును నిజనివాసంబునకుం జని తనభార్యల కిదిచెప్పి యారాత్రి గడిపి మఱునాఁడు అచ్చకు వచ్చి మతిమంతు నాహ్వానంబునేసి యీ శ్లోకంబు జదివిన విని యతండు తలయూఁచి "దీనియర్థంబు నేఁ దెలిపెద, దేవా! చంద్రభాగానదీస్నానం బనుదినంబుఁ బ్రాతఃకాలంబున నీ భార్యలతోడఁ జని సేయుచుఁ బట్టణంబు వెలుపలనున్న కాళీకాలయంబునకుం బోయి ప్రత్యహంబు భక్తినియమంబులు గల్గి పూజింప మూఁడు దినంబులకు నీకు మేలునేకూరు" ననిన నా యవనిపాలచంద్రుఁ డా మఱునాటనుండి యట్లనేయుచు మూఁడవనాఁడు కలవాణీకాంతిమతీయుక్తుండై భక్తియుక్తిం

బూజించుతఱిఁ గాత్యాయని ప్రత్యక్షంబైనం గాంచి క్షితిపతి యిట్లని నుతియింపం దొడంగె. "ఓదేవిమతల్లీ! యో తల్లీ! భక్తజనకల్పవల్లీ! గుణముల పాలవెల్లీ! యీ యఖిలాండ కోటిద్రుహిణాండభాండంబులు వాన, వాడ, వ్రయ్యాలుచేయ నీవకావె. సకలచరాచరంబులు భవదీయమాయాకల్పితం బులెకాని వేఱొండులేదు. నీగుణత్రయంబు మూర్తిత్రయం బయ్యె. మాయయనఁ బ్రకృతియన నవిద్యయన నీవకావె? నీయందు లోకంబులుండు. నీవు లోకంబులం దుందువు; నిన్నుఁ దెలిసి స్తుతియింప నే నెంతవాఁడ. మాయమ్మా! ననుఁ గరుణింపు" మనుడు నా దేవి ప్రసన్నరాలయి యత్యంతదయా రసంబున "ఓరాజా! ఇవియే రెండు మామిడిపండ్లు; వీని నీ భార్యలచే భుజింపఁజేయుము; చెఱియొక తనయుండు జని యించు" నని ప్రసాదించి యంతర్ధానంబునొందె. పద్మ పాదుండును భార్యాసమేతుండై యింటికివచ్చి వారలచే దివ్య ఫలభక్షణంబుసేయించి యథేచ్ఛం బ్రవర్తింపఁ గొన్నాళ్లు కా యింతులకు నెలలుదప్పి మోములు వెల్లనై, బడలికలు తఱచులై, చిట్టుములు, నోకిరింతలు, పాలుమాలికలు, పడక కోరికలు, దోఁచి నానాట నెలకొక చెలువునం గులుకుచున్న యావన్నెలాడులకుఁ జంద్రాననామందయానాది నామంబులు తథ్యంబులయ్యె. బింబాధరాగగనమధ్యాదివిశేషంబు లసత్యంబులయ్యె. అంత ధరాకాంతుఁ డత్యంత సంతోషంబున శయ్యాసుఖంబులు మఱచె; నిట్లు నవమాసంబులు నిండినఁ దిథివారనక్షత్రయోగకరణలగ్నహోరాద్రేక్కాణ నవాంశ ద్వాదశాంశత్రింశాంశలు శుభదంబులై యుండ స్వక్షేత్రమిత్ర క్షేత్రస్వపరమోచ్చల సూర్యాదిగ్రహసప్తకంబు ప్రకాశింప

మహారాజయోగంబునం గాంతిమతికిఁ జగన్మోహనాకారుం డైన కుమారుం డుదయించె. ఆమఱునాఁడు గలవాణికి సకలగణగణనపాత్రుండై న పుత్రుండు పుట్టె. ఆసమయంబుల రాజు పరమోత్సాహంబునం బుత్రోత్సవంబులు చేసి షోడశ మహాదానంబుల భూసురులఁ దృప్తినందించి పేదలకర్థంబులిచ్చి జాతకకర్మంబులు గావించి పెద్దవానికిఁ బ్రతాపభానుండును రెండవవానికిఁ గీర్తిచంద్రుండు నని నామకరణంబులు సేసి యేవేళం బాలలాలనలాలసుండై ప్రేమాతిరేకంబునఁ బెనుచుచు,

నవసుధాధీశవిఖ్యాక
వసుధాధీశవిఖ్యాక
సుధాధీశవిఖ్యాక
ధాధీశవిఖ్యాక
ధీశవిఖ్యాక
శవిఖ్యాక
విఖ్యాక
ఖ్యాక
కవిరసభామాత్త
విరసభామాత్త
రసభామాత్త
సభామాత్త
భామాత్త
మాత్త

తమోహారహిత
మోహారహిత
హారహిత
రహిత
హిత

తతనయాభ
తనయాభ
నయాభ
యాభ

భవనగ
వనగ
నగ

గజప
జప
పశ్రీ
శ్రీ

లం బెనుపొంది కీర్తిప్రతాపబుద్ధిసుఖజవసత్వవిద్యాసంపన్నుం డై పద్మపాదుండు ప్రజాపాలనంబు సేయుచు సుఖంబుండె.

శ్రీ శ్రీ శ్రీ



# అనుబంధము

ఈ గ్రంథముయొక్క అంతమునందున్న "నవసుధాధీశవిఖ్యాక" మొదలగు పదములకు బ్ర॥ శ్రీ॥ పన్నాల సీతారామబ్రహ్మశాస్త్రిగారు వ్రాసినయర్థము.

నవసుధాధీశవిఖ్యాక = కాంతిచే - నభినవచంద్రుఁడని - విఖ్యాతిగల

వసుధాధీశవిఖ్యాక = రాజులలోఁ బ్రసిద్ధిగల

సుధాధీశవిఖ్యాక :- సుధా = అమృతమువంటి - ధీ = బుద్ధిగల - ఈశ = రాజులలో - విఖ్యాక = ప్రసిద్ధిగల

ధాధీశవిఖ్యాక :- ధ = ధనధాన్యములకు - అధీశవిఖ్యాక = అధిపతిఖ్యాతిగల

ధీశవిఖ్యాక :- ధీ = బుద్ధిచే - ఈశ = శివునివలె - విఖ్యాక = ఖ్యాతిగల

శవిఖ్యాక :- శ = శివుఁడనెడి - వి = పరమాత్మవలె - ఖ్యాక = ఖ్యాతిగల (అనగా శివునియందు పరమాత్మ భావనను జేయువాఁడు)

విఖ్యాక = విశేషఖ్యాతిగల

ఖ్యాక = ప్రసిద్ధిగల

14)

కవిరసభాసూత్తః- కవి = పండితులయొక్క - ఈ = వాక్కులను - ర = గ్రహించునట్టి -సభా = స్వసభా సంబంధమైన - మా = లక్ష్మిచే - ఆత్త = స్వీకరించబడిన

వీరసభామాత్త :- వీరసభా = వీరసభయందు - మ = జనముచేత - ఆత్త= గౌరవవ్యాప్తిగల

రసభామాత్త :- రస = రసవిశిష్టులైన - భామా = భామలచేత - ఆత్త= శ్రీగల

సభామాత్త = సభాలక్ష్మిస్వీకృతంబైన శ్రీగల

భామాత్త :- భామాత్త= సౌందర్యలక్ష్మివిశిష్టమైన

మాత్త = లక్ష్మిప్రాప్తిగల

---

తమోహరహిత:- తమః = అజ్ఞానమును - హర = పోగొట్టు శ్రీహరికి - హిత= ఇష్టమైన

మోహరహిత :- అజ్ఞానరహితుఁడైన
హరహిత= శివునకు హితమైన

రహిత :- ర= త్యాగముచే - హిత= హితుఁడైన

హిత = సర్వసమ్మతుఁడైన

---

తతనయాభ :- తత = విస్తారమైన - నయ = నీతిచే - ఆభ = ప్రకాశించుచున్న

తనయాభ = కుమారులచే ప్రకాశించుచున్న

నయాభ = నీతివిశిష్టశోభగల

యాభ :- యా = లక్ష్మిచే - ఆభ - ఆ = సమంతతః - భా = కాంతిగల

---

భవనగ = గృహమునుపొందిన (అనగా కొన్ని గృహమందున్నవియు)

వనగ = వనమును పొందిన (అనగా కొన్ని వనమందు నిల్పినవియు)

నగ = పర్వతములనుండిన (అనగా కొన్ని పర్వతములమీద నుంచబడినవియు నైన)

---

గజపశ్రీ = ఏనుఁగులను బరిపాలించు శ్రీగల

జపశ్రీ :- జ = జయశీలముగలదియై - ప = పవిత్రమైన - శ్రీ = శ్రీగల

పశ్రీ = ప్రసన్నకీర్తిగల (వాఁడును నని యీ మొదలైన)

శ్రీలు = సంపదలు (చెలువొందగా నని సందర్భము)

**( ఈ పదముల యర్థసంగతి నానార్థ రత్నమాల శరణము )**

సీతారామబ్రహ్మశాస్త్రిగారు రచించిన

## యేకఫణి నాగబంధము



శ్రీమాన్నామప్రదశ్రీ - రధికగుణగణ - ఖ్యాతిభూరిస్థిరాత్మా
రవ్యాభశ్శాంతమాయ-స్సమధిసుకలా-సౌమ్యరమ్యత్వమేతి
దాసుశ్రీరామనామా-భవతు సతుచిర-శ్రేయసే దత్తసౌఖ్యః
కల్యత్వశ్రీరిరంసు - స్సకలకవిరసే - నాదృతస్స్వైరధామా ॥



శ్రీ లక్ష్మీ ప్రెస్, విజయవాడ-2

# ప్రత్యేకా నసబంధము

## అర్థవివరణము

ఇందలి పదములు కొన్నింటికి నాటివారికి సులభగ్రాహ్యము లగు నట్లుగా నర్థవివరణముల నిచ్చుచున్నాను.

పుట 6 నెలపాలు పేరిటి యేఱు = చంద్రభాగానది; సుప్పాణి ముత్యములు = మేలిరకపు ముత్యములు; కరి = అష్టదిగ్గజములు; గిరి = సప్తకులపర్వతములు; కిరి = ఆదివరాహము; కమఠము = ఆదికూర్మము.

పుట 7 అప్పులపాలు = సిటిపాలు; వరుణుడు జలాధిపతి; తిలకచ్ఛలంబున = బొట్టు అనెడి మిషచే; దరము = శంఖము; ముష్టికి = పిడికిటికి.

పుట 8 నిష్కుటము = గృహమందలి ఉద్యానవనము; అనోకహరాజి = చెట్లసమూహము; పున్నాగము = సురపొన్న; పుష్పిణియై = ఋతుమతియై.

పుట 10 దేవవల్లభ మహీరుహము = దేవదారుచెట్టు; అపత్యరాహిత్యము = పిల్లలు లేకపోవుట.

పుట 11 నిజశుభానుషంగము = తనకు మేలుగూర్చునది; పతంగద్వితయము = పక్షుల జంట,

పుట 12 కోశప్రాగభావంబు = నిఘంటువు లేకపోవుట,

పుట 13 తూష్ణీంభావము = ఊరక యుండుట; లక్ష్యపెట్టకుండుట: ప్రాగంగన = తూర్పుదిక్కు అనెడి స్త్రీ.

పుట 14 కించిన్నిమీలిత నయనుఁడు = కొంచెము మూసిన కన్నులు గలవాడు కోటరము = చెట్టుతొఱ్ఱ,

పుట 16 ప్రముచ్చు = దొంగ; పాఱుఁడు = బ్రాహ్మణుడు

పుట 17 చతుష్పాత్ + ప్రాయుడు = నాలుగు కాళ్ళుగల పశువు వంటివాడు;

పుట 19 జలాహికములు = జలపక్షులు.

పుట 20 ద్విజసంఘంబులు = పక్షులు: ద్విజశిఖామణులు = బ్రాహ్మణ శ్రేష్ఠులు.

పుట 21 అనళీకనాళీకపాళి = తుమ్మెదలులేని తామర సమూహము; కుంభినీసుర డింభకుండు = బ్రాహ్మణ యువకుడు

పుట 22 వామహస్తాంగుష్ఠతర్జనులు = కుడిచేయి, బొటనవ్రేలు, చూపుడు వ్రేలు.

పుట 23 సుషిరము = కన్నము, రంధ్రము

పుట 24 భర్మహర్మ్యము = బంగారు సౌధము

పుట 25 ఆకె = ఆమె

పుట 28 వియచ్చారిణి = ఆకాశమున సంచరించునది

పుట 29 మహోన్నత నీలశిలా స్తంభ విభ్రాజమానము = ఎత్తయిన నల్ల రాయిచే కట్టబడిన స్తంభముచే ప్రకాశించునది

పుట 30 తద్ధేతుకంబైన = దానికి కారణమైన

పుట 31 సంభాళించుకొను = ఆలోచించు। ప్రామిన్కులు = వేదములు; సంహితాపదక్రమంబులు = వేదములు చదువుటయందలి స్వర భేదములు; అష్టావధానములు = ఎనిమిది విధములైనఅవధానములు; సుషుమ్న = ప్రాణాయామ విషయమైన నాడి; కుంభకము = వాయువు పూరించి యుంచుట; ఇడా = ప్రాణాయామమున నాడి; అంతర్లీనము చేసి = సమ్మేళనము చేసి

పుట 33 శుకలాలనలాలసుడు = శుకుని లాలించుటయందు ఇచ్ఛగలవాఁడు (శేషాలంకారము); భారతీనిలయము = పాఠశాల.

పుట 34 కించిద్జ్ఞుండు = కొంచెము తెలిసినవాడు: జటిలేంద్రుడు = జడలు గలవాడు.

పుట 36 అధరమార్గసోపానగత = క్రిందకుపోవు మెట్లమీదనున్నదియై

పుట 37 మహాభీల దంష్ట్రికరాళవదనగహ్వరము = భయంకరమైన కోరలచే భీకరమైన గుహవంటి ముఖము

పుట 38 వియద్గామి = ఆకాశమున సంచరించువాడు

" 39 కాలజ్ఞుడు = రాబోవు కాలమును తెలిసినవాడు.

పుట 41 చార్వాకుడు = వితండవాదము చేయువాడు: రాచ రచ్చ = రాజసభ.

పుట 43 చానిదానివలె = చావనిదానివలె; ప్రాగబ్ధి = తూర్పుసముద్రము, ప్రాక్పారావారము = తూర్పుసముద్రము, యాతాయాతపోతవ్రాత సమేతము = వచ్చుచు పోవుచున్న ఓడల సమూహము గలది: భూభృత్సముదయంబు = కొండల గుంపు.

పుట 45 నిజపక్షవాతోద్ధూత బలాహకవ్రాతుఁడు = తన ఱెక్కల తాకుడు వలన గలిగిన గాలిచే నెగురగొట్టబడిన మేఘముల సమూహము గలవాడు. ప్రళయకాలాభీల కీలికీలామాలా మూలంబైన = ప్రళయకాలమునందలి భయంకరమైన అగ్నిజ్వాలలకు మూలంబైన: యోజనాయుత ఫణసందీప్త మాణిక్యచ్ఛటాచ్ఛటలు = ఎనిమిది మైళ్ళవఱకు వ్యాపించిన పడగయందు ప్రకాశించుచున్న మాణిక్యముల కాంతిసమూహములు.

పుట 4 గూఢపాత్ప్రభుండు = గూఢపాత్తు అనగా కనబడని కాళ్లు గలది-సర్పము--అట్టివాని కధిపతి – సర్పరాజు.

పుట 48 శీతకర శీతవాతూలాండజాత, సంఘాతసమేత చేతోజాత యాత నాతి భీతచేతస్క = చంద్రుడు, మలయానిలము, కోయిలలు వీనితో కూడుకొన్న మన్మథుని బాధచేత, భయపడుచున్న మనస్సు గలది.

పుట 53 దుగ = రెండు, దచ్చి = ఎనిమిది, బార = పంద్రెండు, ఇది జూదపు పరిభాష.

పుట 54 గుణత్రయంబు మూర్తిత్రయంబయ్యె — సత్త్వరజస్తమో గుణములు మూడు గుణత్రయము. బ్రహ్మ విష్ణు మహేశ్వరులు = త్రిమూర్తులు,

ఈ పుట చివరగల భాగమంతయు జ్యోతిశ్శాస్త్ర సాంకేతిక పదములతో నిండినది. అది వివరించిన గ్రంథవిస్తర మగును. గాన విరమించితిని – వాస్తవముగా దీనికి టీకాతాత్పర్యము లావశ్యకము.

నిడదవోలు వేంకటరావు.

# పన్నాల సీతారామబ్రహ్మశాస్త్రి - వీరేశలింగము

ఈతడు క్రీ. శ. 1820-1900 ప్రాంతమున జీవించి యుండెను. వీరేశలింగముగారి కీతడు సాహిత్యవిద్యాగురువుగా నుండెను. కాని యావిషయము తమ స్వీయచరిత్రమునగాని, ఇతరత్రాగాని, ఎచ్చటను తెలుపలేదు. వీరేశలింగముగారికి సమకాలికులు కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారు. వీరు వీరేశలింగము పంతులుగారి విద్యాగురువు అనువిషయము గ్రంథస్థము చేసిరి. 1

వడ్డాది సుబ్బారాయుడుగారు, తమ సూక్తివసుప్రకాశముపై పన్నాల వారి యభిప్రాయము ప్రకటించుచు నిట్లు వ్రాసినారు ; 2

వీరేశలింగముగారి శాకుంత లాంధ్రీకరణమున తోడ్పడిన వారి విద్యాగురువులు పన్నాల సీతారామబ్రహ్మశాస్త్రిగా రొసగిన యభిప్రాయము.

వీరు వీరేశలింగముగారి గురువులని తూర్పుగోదావరీజిల్లా శిష్ట లోకమున కంతకు దెలియును. వీరు సంకుసాల నృసింహకవి "కవికర్ణ రసాయనము" నకు బదులుగా "ఖలకర్ణ విషాయనము" అను గ్రంథము రచించిరి. ఇదియు పద్యకావ్యమే. అముద్రితము.

ఇది పిండిప్రోలు లక్ష్మణకవి రచితమైన రావణదమ్మీయమువంటి తిట్టుకావ్యము.

శివపంచ స్తవములలో ప్రథమమైన మహిమ్నమును వీరు తెనుగు పద్యములలో రచించిరి.

వీరు చాటుకవితయందు ప్రవీణులు. రమారమి నూరేండ్ల క్రిందట తూర్పుగోదావరీమండలమున 'రంప' పితూరీ సందర్భమున వీరు రచించిన యీ క్రింది పద్యము సర్వాంధ్రదేశమున ప్రసిద్ధమైనది,

"రంప పరాయిగుంపు జొరరాని రహస్యపుఁ గొంప కాన్స్టిబిల్
గుంపుల దొంప కోయదొర కూటువదుంప విరోధిగుండె వా
లంప, పితూరిదారుల గలంపఁగ వచ్చెది తెల్లవారికిన్
కంపన నిచ్చి మించు తటకావడ జేసెడిశంప యిమ్మహిన్. 3

---

1 శాకుంతల విమర్శనము 1910

2 సూక్తివసుప్రకాశము. 1892 ముద్రణము

3 భారతి [illegible]

త్వరపడుడు. కొద్దిప్రతులు మాత్రమే గలవు. త్వరపడుడు.

మహాకవి దాసు శ్రీరాములుగారిచే రచియింపబడి
వారికి అభినవశ్రీనాధుడను ఖ్యాతి గడించిన

# తెలంగాణా నాడు

(ఆరవకూర్పు)

ఇందు సంఘవిషయముల గూర్చి ఆంధ్ర బ్రాహ్మణుల
ఆచారవ్యవహారములు, వేషభాషలు స్వాభావి
కముగ వర్ణింపబడినవి - సుప్రసిద్ధ ఆంధ్ర
కవులయిన తిరుపతి వేంకటేశ్వరులలో
నొకరగు శ్రీ చెళ్ళపిళ్ళ వేంకట
శాస్త్రి శతావధానులవారి
మన్ననల నందుకొన్నది.

మచ్చునకు :- వైదికులు

ఉ. లేవరు లెండు లెండనిన, లేచినవారయినం దటాలునం
బోవరు, పోవుచున్నిలిచి పోదుముపోదుము త్రోయకుండటం
చీవరు సందు గేస్తు వలయింతురు పెండిలిలో సదస్య సం
భావననాఁడు చూడవలె బాపనసాముల సాము లన్నియున్.

నియోగులు

ఉ. నమ్మిన నమ్మకున్న నది నావశమా ! జనులాడుకొన్న వా
క్యమ్ములు నేనుజెప్పెద భయంపడియో పడకో ! నియోగిలో
క మ్మనివార్యకార్య ఘటకమ్ము వుఁగాని పరోపకార శూ
న్యమ్మను స్వప్రయోజనపరాయణమున్ దలపోయ నిద్ధరన్.

వెల : రు. 3-00 మాత్రమే

---

ప్రతులకు :

**మహాకవి దాసు శ్రీరాములు స్మారక సమితి,**

**1-10-97 అశోక్‌నగర్, హైదరాబాదు - 20**

అచ్చుకానున్నది. త్వరలో వెలువడును.

# శ్రీమదాంధ్ర దేవీభాగవతము

( ౪వ ముద్రణము )

మహాకవి దాసు శ్రీరాములుగారిచే రచియింపబడి
గ్రంథకర్తగారికి మహాకవి బిరుదము చేకూర్చిన
మేటి గ్రంథము

పురాణ కాలక్షేపములలో అతివిరివిగా
నుపయోగింపబడుచున్నది

మచ్చునకై నొక పద్యము :

మ. మళయాళీకుచలిప్త చందన పరామర్శక్రియా లోలుఁడై
వలపెక్కం ద్రవిడీముఖస్ఫురిత భవ్యద్రవ్య తాంబూల గం
ధిలుఁడై యాంధ్రకుటుంబినీ కచభరానేక స్రగానందియై
కలయం గ్రుమ్మరు దక్షిణానిలుఁడు చక్కం బెట్టునో యవ్వనిన్.

---

ప్రతులకు,

మహాకవి దాసు శ్రీరాములుగారి స్మారకసమితి
1-10-97 అశోక్‌నగర్, హైదరాబాదు - 20.